## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# మృదంగబోధిని



గ్రంథకర్త :
మహాదేవు రాధాకృష్ణరాజు
రిటైర్డు మృదంగం లెక్చరర్
ప్రభుత్వ సంగీత కళాశాల, విజయవాడ

# విషయసూచిక

## అభ్యాసములు (ప్రాక్టికల్)



## లక్షణం (థియరి)



కీ. శే. శ్రీ పుదుకోట మాన్పూండియాపిళ్ళేగారు



శ్రీ పుదుకోట దక్షిణామూర్తిపిళ్ళేగారు



తిరువాన్కూరు ఆస్థాన మృదంగవిద్వాన్

కీ. శే. శ్రీ పళని సుబ్రహ్మణ్యంపిళ్లేగారు



'మార్దంగికాగ్రేసర'

కీ. శే. శ్రీ పొట్లూరి వీరరాఘవయ్యచౌదరిగారు

కృతిభర్త

నా యీ కృతిని

మా గురుదేవులు

శ్రీ పొట్లూరి వీరరాఘవయ్యచౌదరిగారి

కంకితమొనర్చి

గురు ఋణము నీ రూపముగ తీర్చి కృతార్థత నందగోరితిని.

నా యీ కృతి యిట్టి యాకృతి వహించుటకు

సహకరించిన ఆత్మీయు లందరికి నా అభివందనాలు.

దుర్గాపురం
విజయవాడ - 3

'మృదంగవాద్య విశారద'
మహాదేవు రాధాకృష్ణరాజు

# అభిప్రాయములు

'మృదంగ వాద్యవిశారద' శ్రీ మహాదేవు రాధాకృష్ణరాజుగారు రచించిన మృదంగలక్ష్యగ్రంథమును చూసినాను. కళలు లక్ష్యములు. లక్ష్యము క్రమబద్ధమై యుండుటకుగాను లక్షణమేర్పడెను. లక్షణబద్ధమైన లక్ష్యమే విలక్షణమైనది. ఈ రహస్యమును గ్రహించి శ్రీ రాధాకృష్ణరాజుగారు లక్ష్యగ్రంథమును రచించ పూనుకొన్నారు. శ్రీ రాజుగారు మృదంగ విద్వాంసులుగా సుమారు 40 సంవత్సరాలపైబడి పేరెన్నికగన్నారు. వారి యనుభవము విలువైనది. యువకళాకారులకు ఉపయుక్తమైనది. సాధారణముగా లక్షణగ్రంథకర్తలు లక్ష్యశుద్ధి తక్కువగాగాని, అసలు లేకగాని యుండుట విదితము. అట్లే లక్ష్యజ్ఞులు లక్షణ గ్రంథములు వ్రాయ బద్ధకించెదరు. అనేకమందికి విద్య చెప్పి, కళాశాలలో అధ్యాపకులుగా యుండి మిక్కిలి అనుభవము గడించిన శ్రీ రాజుగారు ఇట్టి లక్ష్యగ్రంథమునువ్రాయుట అత్యంత ముదావహము. వారు నాకు అనేకవందల కచేరీలకు వాయించి యున్నారు. వారి పాండిత్య గరిమ బహుశః నాకన్న అనుభవించి తెలుసుకున్నవారు లేరనుట సాహసము కాదనుకుంటాను.

ఈ గ్రంథమును అంతేవాసులకే గాక మృదంగ విద్వాంసులకు సైతము ఉపయుక్తమై శ్రీ రాజుగారి కృషికి సాఫల్యత గలిగింపజేయగలదని ఆశిస్తున్నాను.

మదరాసు

**పద్మశ్రీ డాక్టర్ ఎం. బాలమురళీకృష్ణ**

ప్రముఖ మార్దంగికులు శ్రీ రాధాకృష్ణరాజుగారిని ఎరుగనివారు బహుశః సంగీత ప్రపంచంలో వుండరని నా భావన. ఆయన నా కాప్తమిత్రులు. సహృదయులు, వినయశీలి, అనుభవశాలి. సుమారు 40 సంవత్సరములనుండి అనేక కచేరీలకు వాయిస్తూ గడించిన ఆయన అనుభవం అమూల్యమైనది. శ్రీ రాజుగారు మృదంగమునుగురించి ఒకగ్రంథాన్ని రచిస్తున్నట్లు తెలిసి మహదానందాన్ని పొందాను. తరువాత గ్రంథాన్ని ఆద్యంతం పరిశీలించాను. మృదంగ విద్యార్థులకు, మృదంగ విద్యాసక్తులకు కూడా యీ గ్రంథం వరప్రసాద మవుతుందని నా దృఢమైన నమ్మకం. ప్రభుత్వ పరీక్షకు సెలబస్ ననుసరించి చక్కగా సులభగ్రాహ్య మగునట్లు రచింపబడడమేగాకుండా, మృదంగవాద్యం పుట్టుక, దానిచరిత్ర, యింకా ఆ వాద్యాన్ని గురించి మరికొన్ని అమూల్యమైన విషయాలు యిందులో పొందుపరుపబడి ఉన్నాయి. ఇంతవరకు మృదంగ విషయంలో పాఠాంతరం ఒక నిర్దిష్టమైన పద్ధతిలో లేదనే చెప్పాలి. శ్రీ రాజుగారు మృదంగ పాఠాన్ని క్రమబద్ధంగా, నిర్దిష్టంగా ఏర్పాటుచేసి ఇందు రచించడం ఎన్నదగ్గ విశేషం. సంగీత విద్యార్థులు ఎక్కడైనా సరే సరళీలు, జంటలు, అలంకారాలు ఏవిధంగా క్రమబద్ధంగా నేర్చుకుంటారో అలాగే ఇందులోని పాఠక్రమం మృదంగ విద్యార్థులకు చక్కగా ఉపయోగిస్తుంది.

ఇది అత్యంత ఉపయుక్తమయిన గ్రంథమనడంలో నా కెటువంటి సందేహములేదు. ఇంత చక్కని ఉపయోగకారియైన గ్రంథరాజాన్ని రచించి దక్షిణదేశ సంగీత ప్రపంచానికి ఒనరించిన యీ సేవకు మిత్రులు శ్రీ రాధాకృష్ణరాజుగారిని హృదయపూర్వకంగా అభినందిస్తూ, యీగ్రంథం నిస్సంకోచముగా బహుళ జనాదరణ పొందగలదనే దృఢంగా విశ్వసిస్తున్నాను.

**కోలంక వెంకటరాజు**

లలితకళలు సాక్షాత్తు సద్గురు ముఖతః నేర్చుకోవలసినవేకాని పుస్తకాలను చూచి నేర్చుకోదగిన విద్యలు కావని నా దృఢాభిప్రాయము. కాని నలభై సంవత్సరములు మృదంగవిద్యా లోకంలో పరిగణించ దగిన స్థానాన్ని పొందిన శ్రీ మహాదేవు రాధాకృష్ణరాజుగారు అనుభవపూర్వకముగ వ్రాసిన "మృదంగ బోధిని" కూలంకషంగా చూడడం జరిగినది. ఈ పుస్తకములో ఉన్నది ఉన్నట్లుగ విద్యార్థులకు నేర్పడము కూడా జరిగినది. నేర్పినది ఏవిధముగ విద్యార్థిలోకంలో ప్రతిఫలించినది కూడ వినడము జరిగినది.

ఇంతవరకు మృదంగవిద్యాభ్యాసానికి తెలుగుభాషలోని పుస్తకములు విద్యార్థి తెలుసుకోలేని విధముగాను, మధ్యస్థునికి అర్థంకాని విధముగాను, విద్వాంసులకు అవసరములేని విధముగాను లక్ష్యాన్ని వదలి లక్షణాన్ని క్రోడీకరించుతూ రచయితకు తోచినవి ఊహించుతూ వ్రాసినవే. అలాకాకుండ లక్ష్యాన్నే దృష్టిలో పెట్టుకొని అనుభవపూర్వకముగ విద్యార్థికి వాద్యంమీద చెపుతూ చెప్పినదానిని వ్రాయటం జరిగినది. అదే ఈ పుస్తకముయొక్క ప్రత్యేకత. ఇది సామాన్య విషయము కాదు.

ప్రస్తుతము మనదేశములో కర్నాటక సాంప్రదాయానికి చెందిన మృదంగ వాద్యం రెండు బాణీల మీద ఆధారపడి యుంది. అందొక బాణీకి అధినాథులు శ్రీ మహాముడియా పిళ్లె. వారి శిష్యులు శ్రీ పుదుక్కోటై దక్షిణామూర్తి పిళ్లె. శ్రీ పుదుక్కోటై దక్షిణామూర్తి పిళ్లె, శ్రీ పళని సుబ్రహ్మణ్యం పిళ్లెగార్ల శిష్యులు శ్రీ పొట్లూరి వీరరాఘవయ్య చౌదరిగారు. శ్రీ చౌదరిగారి శిష్యులు శ్రీ మహాదేవు రాధాకృష్ణరాజుగారు. సత్సంప్రదాయము, సద్గురువులు ప్రసాదించిన బాణీని పాఠ్యక్రమములో పుస్తకరూపముగ వ్రాసి శ్రీ రాజుగారు ధన్యత పొందియున్నారు.

ఆంధ్రదేశములో సంగీతపరమైన విద్యలు నేర్చుటకుగాను కాలేజీలు పెట్టి యున్నారు. ఈ కాలేజీలలో మృదంగవిద్యకు ఇంతవరకు సక్రమమైన పాఠ్యక్రమము లేదని నా అభిప్రాయము. ఈ పరిస్థితిలో మృదంగము నేర్చుకునే విద్యార్థికి ఒక సక్రమమైన పాఠము అలవరచుటకు తగిన పుస్తకము వ్రాసిన శ్రీ మహాదేవు రాధాకృష్ణరాజుగారు అభినందనీయులు.

A. I. R.
విజయవాడ

దండమూడి రామమోహన్‌రావు

శ్రీ మహాదేవు రాధాకృష్ణరాజుగారు మృదంగ విద్యయందు మంచి గురువులవద్ద సుశిక్షితు లగుటయేకాక ఆ విద్యను అనేక రంగస్థలములయందు ప్రదర్శించి వన్నెకెక్కినవారు. వారు మృదంగ సంబంధమయిన ఈ గ్రంథమును రచించుటకు ఎంతయు నర్హులు. ఈ గ్రంథము విద్యార్థులకు మిక్కిలి ఉపయుక్తము కాగలదని నా విశ్వాసము.

వారి కున్న శిక్షణానుభవమును పురస్కరించుకొని ఈ గ్రంథము వ్రాసి, ప్రచురించుట నా కెంతయు ముదావహము.

తిరుపతి

నే. కృష్ణమూర్తి

పూర్వం విద్య చాలా రహస్యంగా నుండేది. విద్య నేర్చుకోవాలి అంటే గురుశుశ్రూషాక్లేశం అనుభవించితేనే, ఆ గురువుకు అనుగ్రహం కలిగితేనే వచ్చేది. శిష్యులు కాస్త బుద్ధిమంతులయినా వాళ్లకు కావలసిన ఏ చిన్న ముక్క అయినా గురుముఖతఃగానే రావలసి వచ్చేది. శాస్త్రాలు మొదలయినవి తాళపత్రాదిగ్రంథాలలో భద్రపరుపబడి యుండేవి. తాళపత్రయుగంలోనుంచి పత్రయుగంలోనికి వచ్చాము. సంగీతవిద్యమాత్రం కేవలము గురుకటాక్షము మీదనే ఆధారపడి యుండేది కొంతకాలానికి పూర్వము. బుద్ధిమంతులు ప్రాథమిక స్వరావళి మొదలుకొని పల్లవి ప్రస్తార పద్ధతి వరకు సంగీతాన్ని లిపిబద్ధంచేసే విధం కనిపెట్టిన కారణంగా ఎన్నో గ్రంథాలు వెలువడినవి. అయితే గురుశుశ్రూషవల్ల కొన్ని రహస్యాలు తెలుసుకొన్న తరువాతనే గ్రంథాలు జ్ఞానాభివృద్ధికి తోడ్పడతాయి. కాని మృదంగవిద్యలో ఇట్టి గ్రంథాలు ఎందుకు ఉండకూడదు అని అనుకునేవాడిని. అది ఈనాడు తీరినది. ఆ తీరుటలో కూడ చాల న్యాయముగా తీరినది.

ఈ గ్రంథరచనకు పూనుకొనేవారికి ముందుగా విశిష్టసంప్రదాయపాఠము, తరువాత ఆ కళలో వ్యుత్పత్తి, పలుమారులు రంగస్థలము లెక్కి ఓహో అనిపించుకొనే ప్రదర్శన కౌశలము, అనేకమంది సంగీతవిద్వాంసుల ప్రక్కన సంపాదించిన అనుభవము, విద్య మనస్సులో మాగిన వయస్సు, బోధన పాటవము, త్యాగబుద్ధి ఇవన్నీ వరుసగా కావాలి. ఇన్నిటిలోనూ దేనిలోనూ తక్కువకలవారుకారు శ్రీ మహాదేవు రాధాకృష్ణరాజుగారు. శ్రీ రాజుగారి చేతిలోనుంచి "మృదంగబోధిని" వెలువడుచున్నదంటే ఇది ఎంతో శుభోదర్కము. ముందు యుగాలవారికిది ఆదర్శము. ఈ గ్రంథమునందలి గుణములను నాకన్న పెద్దలు చెప్పియుండిరి. మరల నేను చెప్పిన చర్విత చర్వణము.

A. I. R.
విజయవాడ

**నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు**

చిరంజీవి 'మృదంగవాద్య విశారద' శ్రీ మహాదేవు రాధాకృష్ణరాజుతో నాలుగు దశాబ్దాలకు పైగా నాకు మిక్కిలి ఆత్మీయమైన సాన్నిహిత్యముగలదు. వీరి పాండితీప్రాభవం, వాద్యనైపుణి మున్నగు విశేషములను లోకమునకు పరిచయము చేయబూనుట మధ్యాహ్నమార్తాండుని కాగడాతో చూపించునట్లగును. విద్వత్తులోను వాద్యమార్దవములోను అనితర సాధ్యమైన సామర్థ్యముతోపాటు సౌశీల్యము, వినయసంపద, సహృదయత వీరికి వెలలేని భూషణములుగా వెలుగొందుచున్నవి. ఇది వీరి ప్రత్యేక లక్షణము. వీరు చిరకాలోపార్జితమైన తమ మృదంగవాద్య విద్వత్తుకు తమ అనుభవమును జోడించి శిష్యశిక్షణలో తమకుగల అపారసామర్థ్యమును వెల్లడించుచు రచించిన "మృదంగబోధిని" అను పేరుగల ఈ గ్రంథము ఆంధ్రప్రదేశములోనేగాక దక్షిణభారతములో గల మృదంగవాద్య విద్యార్థులకు, విద్వాంసులకు పరమోపాదేయముగా నుండి తత్పాండితీ జ్ఞానమునకు కరదీపికగా నుండునని నా నిశ్చయాభిప్రాయము.

విజయవాడ

శ్రీ మదజ్జాడ ఆదిభట్ల నారాయణదాసుగారి ప్రియశిష్యులు
**నేతి లక్ష్మీనారాయణ భాగవతులు**

విజయవాడ వాస్తవ్యులును, ప్రముఖ మృదంగ విద్వాంసులునగు శ్రీ మహాదేవు రాధాకృష్ణరాజు గారు రచించిన 'మృదంగబోధిని' అను వ్రాతప్రతి గ్రంథమును సాకల్యముగా పరిశీలించితిని. అందుగల వివిధ భాగములను రచయితయగు శ్రీ రాజుగారి ముఖతా వింటిని.

శ్రీ రాజుగారిని నలుబది సంవత్సరములనుండి యెరుగుదును. వారు కార్యదీక్షగల సుస్వభావులు. వీరు దక్షిణ భారతంలో మార్దంగికాగ్రేసరులుగా ప్రఖ్యాతి గడించి కీర్తిశేషులైన శ్రీ పొట్లూరి వీర రాఘవయ్యచౌదరిగారి ముఖ్యశిష్యులు. మృదంగవాద్యములో సక్రమమైన శిక్షణ పొందగోరు విద్యార్థులకు తదితర కళాభిమానులకు తగిన పాఠ్యగ్రంథములు నేటివఱకు లేకపోవడం నిజంగా ఆ కళకే తీఱనిలోటని చెప్పటం అతిశయోక్తి కాజాలదు.

ముఖ్యంగా యీ గ్రంథమునందు ఆంధ్ర ప్రభుత్వమువారు సంగీత కళాశాలలందలి సర్టిఫికేట్ కోర్సు, తదితర కోర్సులకు నిర్ణయించిన పాఠ్య ప్రణాళికల ననుసరించి మొదట చినపాలవరుసలు తదుపరి పెదపాలవరుసలకు సంబంధించిన వివిధ రకములగు జతులను ఆది, రూపక, త్రిపుట మొదలగు తాళములలో ప్రాథమిక శిక్షణ మొదలు ఉన్నత శిక్షణవఱకు నుపయుక్తమగునటుల, తాళాంగ, ఆవర్త అంత్య, కాల ప్రమాణగుర్తులతో పొందుపఱచి వ్రాయటం యెంతయు మెచ్చదగిన విషయమగును. శ్రీ రాజుగారు యింకను యిట్టి గ్రంథములు రచించుటకు తగిన ఆయురారోగ్య ఐశ్వర్యములను ప్రసాదించుటకు భగవంతుని ప్రార్థిస్తున్నాను.

విజయవాడ

**అరిపిరాల సత్యనారాయణమూర్తి**

“మృదంగవాద్య విశారద” శ్రీ మహాదేవు రాధాకృష్ణరాజుగారిని ఆంధ్రదేశంలో తెలియని వారు లేరు. వీరు సంగీత ప్రపంచములో కురువృద్ధులైన భీష్మాచార్యులంతటివారు.

వీరు “మార్దంగికాగ్రేసర” శ్రీ పొట్లూరి వీరరాఘవయ్యచౌదరిగారి శిష్యులు. నేనుకూడా కొంతకాలము రాజుగారితో కలిసి శ్రీ రాఘవయ్యగారి దగ్గర మృదంగము నేర్చుకున్నాను. వీరు పూర్వము గురుకులాశ్రమములలో వలె యెంతో భక్తి శ్రద్ధలతో, వినయ విధేయతతో గురుశుశ్రూష చేసి వారి ఆశీస్సులు పొంది విద్య నార్జించిన విద్వాంసులు. సుమారు 40 సంవత్సరములనుండి వీరు ప్రముఖ విద్వాంసు లందరికీ ప్రక్క వాయిద్యం వాయిస్తూ వారి మన్ననలు పొందినారు.

వీరు “మృదంగబోధిని” అను పుస్తకమును వ్రాసిరి. అది విద్యార్థులకును, విద్యాసక్తులకును చాలా ఉపయోగపడు ననుటలో ఎట్టి సందేహము లేదు. అది క్రమ పద్ధతిలో, సాంప్రదాయకముగా నున్నది. ఇంత క్రమబద్ధంగా, అంగ సౌజ్ఞలతో పాఠం వ్రాసిన పుస్తకము ఇంతవరకు అచ్చులో వెలువడలేదని చెప్పగలను.

శ్రీ రాజుగారికి 1954 సంవత్సరములో మధ్వశ్రీ శ్రీ కాశీకృష్ణాచార్యులవారి పర్యవేక్షణలో ఘన సన్మానం జరిపించినాము. ఆ సన్మాన సభలో పలువురు విద్వాంసుల ప్రశంసలతోపాటు సువర్ణ ఘంటా కంకణము పొందుటయే గాక రు. 5116-00 బహుకరణ పొందిన ఆప్తమిత్రుడు వ్రాసిన యీ పుస్తకము బహుముఖంగా ప్రజాదరణ పొందగలదు.

విజయవాడ

**నర్రా గోపాలకృష్ణయ్య**

శ్రీ మహాదేవు రాధాకృష్ణరాజుగారు రచించిన 'మృదంగబోధిని' అన్న గ్రంథము శ్రీ రాజుగారు నా దగ్గరకు తీసుకుని వచ్చి కొన్ని భాగాలు పాడి, వాయించి నాకు వినిపించినారు. వీరు కీ॥ శేషులైన శ్రీ పొట్లూరి వీరరాఘవయ్యచౌదరిగారి శిష్యులు. నా చిన్నప్పుడు వీరరాఘవయ్య చౌదరిగారిని నే నెరుగుదును. వారు తమిళదేశమునకు పోయి అచ్చట గొప్పమృదంగ విద్వాంసుల దగ్గర నేర్చుకొని వచ్చిరని, గొప్పగా వాయించగలరని చెప్పికొనెడివారు. రాజుగారు కూడ వారి సంప్రదాయములో గొప్పగా వాయింపగలరు. మృదంగములో గొప్ప విద్వాంసులు. యీ గ్రంథము విద్యార్థులకంటె మద్దెల పాఠములు చెప్పువారికి మిక్కిలి ఉపయోగకరము. విద్యార్థు లీ గ్రంథమును దగ్గర నుంచుకొనినచో గురువు చెప్పిన పాఠము సాధనముచేయుటకు చాల ఉపకరించును.

సంగీతవిద్వాంసులకు కూడ వారికి తాళ గతులు తెలిసినను, దీనిని కూడ చూచి కొంత తెలిసి కొన్నచో నట్టివారికి వారిగానము ప్రక్కవాయించు మృదంగ విద్వాంసుని అనుసరించుటకో అనుసరింప జేయుటకో మిక్కిలి ఉపకరించును. యీ గ్రంథమువంటి గ్రంథము తెలుగులో ఇంతవరకు రాలేదని చెప్పవచ్చును. అన్ని విద్యలవలె యీ విద్యయు ఆ విద్య మొగాన వ్రాశియున్నచో ఎనిమిది పదియేండ్లు పట్టును. విద్వాంసుల మాట అటుంచి సభలలో తలలాడించెడివారు రాగ తాళముల గురించి కొంత తెలిసికొనవలసియున్నది. భావమును గురించి సంగీత విద్వాంసులే చాల తెలిసికొనవలయును. భావ రాగ తాళములు మూడు కలిసియే యుండును. విడబరచుటకు వీలులేదు. తాళమును విడబరచి దాక్షిణాత్యులు ప్రత్యేక విద్యగా చేసినట్లు కనిపించుచున్నది. కనుక తాళమును ప్రత్యేకముగా నేర్చు కొనవలసిన యవసర మేర్పడుచున్నది. వీరు యీ రాజుగారు చేసిన యీ మహా యత్నము యీరీతిగా బహువిధములైన యుపకారమును చేయగలదు. వీరికి భగవంతుడు చిరాయురారోగ్యైశ్వర్యము లొసంగుగాక.

'కవిసామ్రాట్', 'కళాప్రపూర్ణ'

విజయవాడ

**విశ్వనాథ సత్యనారాయణ**

" మృదంగవాద్యవిశారద " శ్రీ రాధాకృష్ణరాజుగారు వ్రాసిన 'మృదంగబోధిని' అను గ్రంథము చాలా బాగున్నది. మృదంగ పితామహులు కీ. శే. దక్షిణామూర్తి పిళ్లై వారివద్ద, తిరుపరి మృదుమధుర నాద లయ విన్యాస మృదంగ విశారదులు, కీ. శే. పళని సుబ్రహ్మణ్యం పిళ్లై గారివద్ద విద్యనభ్యసించి, అనేక మంది శిష్యులను తయారుజేసి, ఆంధ్రదేశములో మృదంగమునకు గౌరవము తెచ్చిన కీ. శే. పొట్లూరి వీరరాఘవయ్య చౌదరిగారి వద్ద గురుకుల పద్ధతిలో 12 సంవత్సరములు విద్య నేర్చుకొని, నలుబది సంవత్సరములుగా అనేక ప్రముఖ విద్వాంసులకు ప్రక్కవాద్యం వాయిస్తూ దేశములో మంచి కీర్తి గడించి, శిష్యుల నేకులను తయారుచేసి, గురువులవద్ద నేర్చుకున్న విద్యకు వారి అనుభవమును జతజేర్చి, తాళ స్వరూపములతో కూడిన వరసలు, తగ్గింపు, ముగింపు, ముక్తాయిస్వరూపము — ఇవి అన్నియూ, తాళాంగ గుర్తులతో వ్రాసిన ఈ గ్రంథము, మార్దంగికులవద్ద, సంగీతజ్ఞులవద్ద నుండదగినదని నా అభిప్రాయము.

A. I. R.

విజయవాడ

**అన్నవరపు రామస్వామి**

'మృదంగబోధిని' అను ఈ పుస్తకము మృదంగమును అభ్యసించు విద్యార్థులకు ఎంతో ఉపయోగకరమైనది. మృదంగము నేర్చుకొనువారికి చక్కని తాళజ్ఞానము కలిగించి సాధనచేయుటకును అభ్యాసము చేయుటకును తగిన శబ్దములను సప్తతాళములలోను కూర్చి శ్రీ మహాదేవు రాధాకృష్ణరాజు గారు ఒక చక్కని పాఠ్యప్రణాళికను ఏర్పరచారు. అంతేకాక తాళ లక్షణములకు తాళాంగములను స్పష్టముగా వివరించారు. మృదంగవాద్యమునకును, తబలావాద్యమునకును సంబంధించిన తాళములను వాటి శబ్దములను (బోల్ తానులను) అక్షరకాలములతో సహా ఇందు వివరించారు. సంగీతకళాశాలలయందు, ఇతరత్రా విశ్వవిద్యాలయ సంగీత పరీక్షలకు తయారగు విద్యార్థులకు ఇది పఠనీయగ్రంథముగా ఉండ తగును. అంతేకాక, సంగీతకళాపిపాసువులయిన ఆంధ్రమహాజనులలోని రసికవరేణ్యులకు కూడ ఇది ఆకర్షణీయమైన సద్గ్రంథము.

విజయవాడ

**బాలాంత్రపు రజనీకాంతరావు**

'మృదంగవాద్య విశారద' శ్రీ మహాదేవు రాధాకృష్ణరాజుగారు మృదంగ వాద్యమును గూర్చి వ్రాసిన గ్రంథమును తాళయుక్తముగ వారు సాంగోపాంగముగ నాకు వినిపించినారు. బాగుగా ఆనందించితిని. ఇంతకు ముందున్న గ్రంథములన్నిటి కంటెను యీ గ్రంథము ఉత్తమోత్తమముగ నున్నది. లోగడ నున్న గ్రంథములన్నియు నేను పరిశీలించినవే. అందువలన యీ గ్రంథమును ప్రభుత్వ సంగీత కళాశాలలలో పాఠ్యగ్రంథముగ ఉపయోగించుట సముచితము. కళాశాలలకే కాక, ఇతర విద్యార్థులకు విద్య గరప నేర్చిన విద్వాంసులకు అందరికి అవసరమయిన గ్రంథము. కనుక ఎల్లరును ఈ గ్రంథమును తప్పక ప్రోత్సహించవలసినదిగా నేను కోరుచున్నాను.

మార్దంగిక సార్వభౌమ

తెనాలి

**తిరుపతి రామానుజసూరి**

'మృదంగవాద్య విశారద' శ్రీ మహాదేవు రాధాకృష్ణరాజుగారు రచించిన 'మృదంగబోధిని' అను వ్రాతగ్రంథమును స్థాలీపులాకన్యాయముగ జూచితిని. వ్రాసినంతవరకు వీరి గ్రంథమునందు ప్రతి తాళమునకును క్రియా భేదములను, అంగ భేదములను గుర్తుచేయుచు వాద్యశబ్దములను క్రమముగ, సులభముగ బోధయగునటుల వివరించిరి. నేను 1945 లో ప్రకటించిన 'సంగీతమార్తాండము' తాళాధ్యాయమునుండి చాలవరకు లక్షణాలను ఈ గ్రంథమున చేర్చిరి. ఈ విషయమును గ్రంథకర్తయగు శ్రీ రాజుగారే స్వయముగా నాకు తెలిపి ప్రశంసాపాత్రులైరి.

శ్రీ రాధాకృష్ణరాజుగారు మృదంగవాద్య పరులలో చాల ప్రసిద్ధులు. వీరు కీర్తిశేషులైన 'మార్దంగికాగ్రేసర' శ్రీ పొట్లూరి వీరరాఘవయ్యచౌదరిగారి శిష్యులు. మంచి అనుభవముతో రచింపబడిన వీరి గ్రంథము అందరికి చాల ఉపయోగపడగలదు. మృదంగ విద్యార్థులకు యింతవరకు యిట్టి గ్రంథములేని కొరతను శ్రీ రాజుగారు తీర్చినారు.

హైదరాబాదు

**పుచ్చా వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి**

'మృదంగబోధిని' అనే గ్రంథము, మృదంగం నేర్చుకొనే విద్యార్థులకు ఒక చక్కని పాఠాంతరాన్ని అందిస్తుంది. సంగీతం వినడం, నేర్చుకోడమే తప్ప, చదువుకోడం అనే అలవాటు చాలామందికి తక్కువ. దానికి తగిన చక్కని పాఠాంతరాలు లభించే గ్రంథాలుకూడా చాలా తక్కువగానే ఉన్నాయి. ఆ లోటు తీర్చి శ్రీ రాధాకృష్ణరాజుగారు మృదంగ విద్యార్థులు అభ్యసించి, సాధన చేయతగిన విషయాన్ని గ్రంథరూపంలోనికి తేవడం ఎంతో గొప్పవిశేషం. ఇందుకు వారెంతో అభినందనీయులు. ఈ గ్రంథం అనేకమంది విద్యార్థులకు, విద్యయందాసక్తిగల రసికులకు బాగా ఉపయోగపడ గలదని ఆశిస్తున్నాను.

విజయవాడ

**వోలేటి వెంకటేశ్వర్లు**

పాటకచేరికి ప్రక్కవాద్యం వాయించే నైపుణ్యంగల కొందరిలో పేరుప్రఖ్యాతులు గడించినవారు శ్రీ మహాదేవు రాధాకృష్ణరాజుగారు. వీరు ఆంధ్రదేశమునకు సుపరిచితులు.

ఆంధ్ర తమిళ దేశములలోని పేరెన్నికగన్న మహావిద్వాంసులందరకూ మృదంగము ప్రక్కవాద్యము వాయించి, అందరి మన్నన లందిన మహనీయులు.

వీరిది సత్సంప్రదాయమైన విద్య. పాటకు అనుగుణంగా వాయించి కచేరి రక్తి కట్టించడం వీరి ప్రత్యేకత. ఎంతటి క్రొత్తవిద్వాంసుని ప్రక్కన వాయించినప్పటికి, శ్రోతలకు అననుకూలముగా వినిపించదు. కొన్నివందల కచేరీలకు కలసి వాయించినట్లు పాటకుని మనోభావానికి అత్యంత అనుకూలముగా అతికిపోయి వుంటుంది.

శ్రీ రాజుగారు వారి అనుభవాన్ని, వారి విద్యను, చక్కని శైలిలో, అందరూ గ్రహించగల్గిన రీతిలో పుస్తకరూపంలో రూపొందించారు.

ఆంధ్రమున ఇంతవరకూ మృదంగవాద్యమునకుగాని, లయవాద్యమునకుగాని, ఉపయోగపడేటట్లు, అనగా ప్రథమాభ్యాసము మొదలు, తనివాద్యము వరకు క్రమమైన పాఠముల పద్ధతిలో గ్రంథము వెలువడి యుండలేదు.

శ్రీ రాజుగారు రచించిన గ్రంథగత విషయాలు వారే స్వయంగా వినిపించగా సావధానంగా విన్నాను. క్రమపద్ధతిలో చిన్నపాలవరసలు మొదలు, మోరా ముక్తాయిల వరకు పాఠముల పద్ధతిలో సప్తతాళములలో వాటియొక్క జాతులలో కాలప్రమాణ గుర్తులతో చక్కగా విపులంగా వ్రాశారు.

సంపూర్ణ లక్ష్యజ్ఞానంతోగూడిన ఈ గ్రంథంలో కావలసిన మేరకు లక్షణం కూడ ఇమిడియున్నది. లయజ్ఞానాన్ని సంపాదించుకొనవలయునన్న అభిలాషగల ప్రతివారికి ఈ గ్రంథం దివ్యజ్యోతివలె ప్రకాశింపగలదు.

ఈ నా చిరుఅభిప్రాయాన్ని తెలుపుకొనుటకు అవకాశాన్ని కల్పించిన పూజ్యులు శ్రీ మహాదేవు రాధాకృష్ణరాజు బాబాయిగార్కి నా కృతజ్ఞతలు.

కర్నూలు

**కర్లపాలెం చంద్రమౌళి**

‘మృదంగవిద్వాన్’ శ్రీ ఎమ్. రాధాకృష్ణరాజుగారు రచించిన ‘మృదంగబోధిని’ సర్టిఫికెట్ కోర్సుకు చాల పనికివస్తుంది. శ్రీ రాజుగారు నాతో ఆ గ్రంథంలో వున్న విషయాలన్నీ మృదంగం వాయించుతూ చెప్పారు. ఈ గ్రంథం అందరికి ఉపయోగపడునది.

న్యూఢిల్లీ **యామని శంకరశాస్త్రి**

శ్రీ మహాదేవు రాధాకృష్ణ రాజుగారిని నేను చిరకాలముగా నెరుగుదును. వీరు మంచి గురుపరంపరలోనివారు. మృదంగ వాద్యములో చాలా అనుభవ పాండిత్యములు కలవారు. ప్రస్తుతం వీరు రచించిన “మృదంగబోధిని” అను గ్రంథమును నేను చూచితిని. ఈ పాఠాంతర మంతయు గురుపరంపరనుండి వచ్చినదని నాకు బోధపడినది. విద్యార్థులకు చాలా ఉపయోగముగా సులభశైలిలో అమరినటువంటి ఈ గ్రంథమును లయజ్ఞానముగల విద్వాంసులందరును తప్పక ఆమోదించెదరని నా విశ్వాసము.

మద్రాసు **చిత్తూరు సుబ్రహ్మణ్యం**

సుప్రసిద్ధమార్దంగిక విద్వాంసులు శ్రీ మహదేవు రాధాకృష్ణరాజుగారు రచించిన “మృదంగ బోధిని” ని చూసి చాల సంతోషం పొందాను. వారు గడించిన విద్యానుభవాన్ని భావితరాల మృదంగ విద్యార్థులకు అందించడంలో ఈ గ్రంథం ఎంతో దోహదం చేస్తుందనడంలో సందేహం లేదు.

ప్రత్యేకించి లక్ష్యప్రధానమైన గ్రంథంగా ఇది మృదంగ విద్యాలోకంలో మిక్కిలి పరిగణలోకి రాగలదని విశ్వసిస్తున్నాను. ఈ విధమైన మిక్కిలి ప్రయోజనకారియైన గ్రంథాన్ని రచించిన శ్రీ రాజుగారు అభినందనీయులు.

వారి గ్రంథం మార్దంగిక విద్యారంగంలో ప్రముఖమైన స్థానాన్ని అలంకరిస్తుందనీ, విద్యార్థి లోకానికి ఎంతో ఉపకరిస్తుందనీ, సంగీత సంస్థలు, కళాభిమానులు ఈ గ్రంథాన్ని ఆదరిస్తారనీ ఆశిస్తున్నాను.

విజయవాడ **ద్వారం భావనారాయణరావు**

ప్రసిద్ధమార్దంగికులు శ్రీ మహాదేవు రాధాకృష్ణరాజుగారు రచించిన ‘మృదంగబోధిని’ యను గ్రంథమును చూచితిని. దానిలోని కొన్ని వరుసలు రాజుగారు వినిపింపగా గ్రహించి సంతోషించితిని.

ఈ గ్రంథము పరీక్షలకు సిద్ధపడు విద్యార్థులకు బహు సులభగ్రాహ్యముగునట్లు వర్గీకరించి వ్రాయబడినది. క్రమముగా సాధన చేయుటకు వీలుగా పాఠము లున్నవి. మృదంగముపై రావలసిన శబ్దము లన్నిటిని ఆ యా ధ్వనిభేదములతో, గతిభేదములతో అక్షరరూపముగా చూపుట ఎంతేని కష్టసాధ్యమైన పని. ఈ గ్రంథకర్త కృషి అనేకులకు మేలుచేయునని ఆశించుచున్నాను. ఇట్టి ప్రశస్త పాఠ్యపుస్తకములను మరికొన్నిటిని ప్రకటించుడని పండితులను ప్రార్థించుచున్నాను.

విజయవాడ **పి. సాలమన్‌రాజు**

శ్రీ మహాదేవు రాధాకృష్ణరాజు ప్రసిద్ధ మృదంగ గురుపరంపరకు చెందినవారు. వీరి గురువర్యులు శ్రీ పొట్లూరి వీరరాఘవయ్యచౌదరి. ఆంధ్రలోనేగాక యావద్దక్షిణాపథంలో ఖ్యాతి నార్జించు కొన్న మహావిద్వాంసులు. వారి వాయిద్యం విని ఆనందించి కొంతవరకు లాభం పొందిన వారిలో నే నొకడను. వారి విద్యకు వన్నెలనిచ్చి తీర్చిదిద్దిన శ్రీ పళని సుబ్రహ్మణ్యపిళ్ళై మృదంగ వాదనంలో ఏకలవ్య పద్ధతిని ప్రభావితుడనైనవాడనుకూడ. సుసంపన్నమైన పాఠాంతరం గల శ్రీ వీరరాఘవయ్యచౌదరి వద్ద చేసిన అనేక సంవత్సరాల శుశ్రూషా ఫలితంగా శ్రీ రాధాకృష్ణరాజు ఎంతో విద్యాగ్రహణం చేసి గురువుతో సమానమైన పాండితిని సంపాదించుకొనడమేగాక, గురువులవలెనే అనేక ఉత్తమ గాయక వాద్య కులతో తమ మృదంగంపైన సహకరించి వారి యొక్కయు శ్రోతల యొక్కయు ప్రశంసలకు గౌరవానికి పాత్రులైనారు. తాము నేర్చిన విద్యను, విజయవాడ ప్రభుత్వ సంగీత నృత్య కళాశాల అధ్యాపకులుగా విద్యార్థుల కెందరికో నేర్పి గురు ఋణం తీర్చుకొన్నారు. అంతటితో తృప్తి చెందక ఉద్యోగ విరమణా నంతరం ఆ విద్యను గ్రంథస్తంచేసి 'మృదంగబోధిని' అనే పేరుతో ఈ గ్రంథాన్ని విద్యార్థిలోకానికి ఇప్పుడు అందిస్తున్నారు.

పరంపరానుగతంగా వారు నేర్చిన విద్యతోపాటు శ్రీ రాజు తాము స్వానుభవంలో సంపాదించిన జ్ఞానాన్ని జోడించి, ఈ గ్రంథంలో ప్రాథమికశిక్షణ కవసరమగు చినపాల వరుసలు, పెదపాల వరుసలు మొదలు సర్టిఫికెట్టు, డిప్లొమా కోర్సులకు కావలసిన అన్ని తాళాలపైన పాఠాలను విరివిగా పొందుపరిచారు. 35 తాళాల జతులు, త్రికాల శబ్ద పల్లవులతోపాటు హిందూస్థానీ సంగీతంలో వాడబడే 12 తాళాలకు బోల్సు తబలా శబ్దాలు కూడా చేర్చి ఆచరణలో కావలసిన అన్ని హంగులను విద్యార్థులకు అందించారు.

లక్ష్యంతోపాటు, పెద్దల గ్రంథాలనుండి సేకరించి మృదంగ విద్యకు ప్రాణమైన సప్తతాళాలు వాటి పుట్టుక, వివరణ, విభజన, దశప్రాణలక్షణం, తాళాంగ వినియోగం, 35 తాళాల పట్టిక, అష్టోత్తర శతతాళనామాలు, హిందూస్థానీ సంగీత తాళాలు జాటి లక్షణాలు, మృదంగోత్పత్తి, మృదంగవాద్య వివరణ అభ్యసించు పద్ధతి, మృదంగం తయారుచేసే విధానం ఇత్యాది మృదంగానికి సంబంధించిన వివరాలెన్నో చేర్చి, ఈ గ్రంథానికి విద్యార్థుల అవసరాలు తీర్చే లక్ష్య, లక్షణ సమన్వితమైన సమగ్ర స్వరూపాన్ని కల్పించారు.

మృదంగ విషయమైన గ్రంథాలు ముద్రితమైనవి బహుస్వల్పం. విద్యార్థుల అధ్యయనానికి తోడ్పడే గ్రంథాలలో బహుశః ఇదే ప్రథమం అనుకుంటాను.

మృదంగ విద్యార్థులు, అధ్యాపకులు వారికి తోడ్పడగల ఈగ్రంథాన్ని ఆదరించి వినియోగించు కొని గ్రంథకర్తకు సంతృప్తిని, సంతోషాన్ని చేకూరుస్తారని విశ్వసిస్తున్నాను. ఎంతో శ్రమచేసి ఇట్టి ఉపయుక్తమగు గ్రంథాన్ని రచించిన మిత్రులు శ్రీ రాధాకృష్ణరాజును హృదయపూర్వకంగా అభినందిస్తు న్నాను.

ఏలూరు

**కంభంమెట్టు వెంకట సుబ్బారావు**

శ్రీ రాజగోపాలస్వామినే నమః

# అభినందనం

శ్లో. శ్రీ రాధాకృష్ణరాజం సురుచిర మహాదేవాన్వయాంభోధి చంద్రమ్
మాన్యం మార్దంగికాగ్రేసర మమలయశస్సాంద్ర మార్యానురక్తమ్
శ్రేయోదానప్రధానః శ్రితజనవరదః శ్రీనివాసో మురారిః
సప్తక్ష్మాభృన్నివాస స్సపది నిజకృపా సౌమ్యదృష్ట్యావతాత్తమ్.

శ్లో. శ్రీ రాధాకృష్ణరాడ్వర్య గ్రథితం సల్లయానుగమ్
శాస్త్ర మత్యంత సుగమం స్యాద్వాణీకంఠభూషణమ్.

శ్లో. ప్రభుత్వసంగీతకళాలయోద్య
న్మృదంగవిద్యాధ్యయనే కృతార్థాః
స్తువంతి శిష్యాః సతతం కృతజ్ఞాః
తం దేశికం శ్రీ మహాదేవ వంశ్యమ్.

శ్లో. జయతు జయతు రాధాకృష్ణరాజాభిధానో
జయతు జయతు తస్యగ్రంథనిర్మాణదీక్షా
జయతు జయతు తస్యప్రాభవం బోధనేచ
జయతు జయతు తస్యచ్ఛాత్రవర్గః ప్రహృష్టః.

ప్రపన్నవిధేయః
**దీక్షితదాసః**

I had the privilege to go through the book *Mridanga Bodhini* written by "Mridanga Vidwan" Professor Mahadevu Radhakrishna Raju garu of Vijayawada.

The book is very interesting and very enlightening. The contents of the book are the very reflections of the experiences of the learned author.

It is very useful not only to Mridangam students but also to the Music students.

He arranged the exercises for all the "Talas", in a very clear and orderly manner. All the exercises are of Southern Tradition.

He wrote "Jaties" for all the "Talas". He created new and pleasing syllables and inserted in the exercises.

He also incorporated the Theory of *Mridangam Playing* in his book for the use of the students.

I wish and hope that this book will occupy a unique place in the field of Mridangam Art.

Secunderabad N. Ch. SATYANARAYANA

I have gone through "Mrudanga Bodhini" written by Sri Mahadevu Radhakrishna Raju Garu. I find it very useful especially for the amatures and generally for all, and the book has been excellently written.

Tiruchirapalli —Alathur S. SRINIVASA IYER

# పోషకుల వివరము

## మహారాజపోషకులు

| | | |
|---|---|---|
| ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమివారు | హైదరాబాదు | |
| శ్రీ కనకదుర్గా కళాసమితి సభ్యులు | విజయవాడ | |
| శ్రీ కొండ ఈశ్వర్రాజుగారు | గుండుగొలను | ప. గో. జిల్లా |
| శ్రీ అల్లంపాటి రామిరెడ్డిగారు<br>"అభినవ కృష్ణదేవరాయ" | అల్లూరు | నెల్లూరు జిల్లా |
| శ్రీ నార్ని కేదారేశ్వరుడుగారు | రాజమండ్రి | తూ. గో. జిల్లా |
| శ్రీ యల్. ఐ. సి. మిత్రబృందమువారు | మచిలీపట్టణం | కృష్ణా జిల్లా |

## రాజపోషకులు

| | | |
|---|---|---|
| శ్రీ చెలమలచెట్టి నాంచారయ్యగారు | అజంతా గోల్డు కవరింగ్ వర్క్సు<br>వలందపాలెం, మచిలీపట్టణం | కృష్ణా జిల్లా |
| శ్రీ మావులేటి అప్పలరాజుగారు | చెన్నూరు | కృష్ణా జిల్లా |
| శ్రీమతి శింగరాజు సత్యవతమ్మగారు | పెదవిరివాడ | ,, |
| శ్రీ రాయల అప్పారావుగారు | మిర్చివ్యాపారం, గుడివాడ | ,, |
| శ్రీ మావులేటి ఈశ్వర్రాజుగారు | గుండుగొలను | ప. గో. జిల్లా |
| శ్రీ కొండ బాల సూర్యనారాయణరాజుగారు | ,, | ,, |
| శ్రీ కొండ గంగరాజుగారు | ,, | ,, |
| శ్రీ కాపల్లి సీతారామకుమార్ రాజుగారు | ,, | ,, |
| శ్రీ తుమ్మలపల్లి సూర్యపాపారావుగారు | రేలంగి | ,, |
| శ్రీ ఆర్. రామచంద్రన్ గారు | విజయవాడ | కృష్ణా జిల్లా |
| శ్రీ కె. విజయరాఘవగారు | ,, | ,, |
| శ్రీ చావలి హనుమచ్ఛాస్త్రిగారు | ,, | ,, |
| శ్రీ యమ్. యస్. గోపాలకృష్ణశర్మగారు | ,, | ,, |
| శ్రీ బి. ప్రభాకరరావుగారు | ,, | ,, |
| శ్రీ అడపాల చంద్రమణిగారు | ,, | ,, |
| శ్రీ కె. రామనాథంగారు | ,, | ,, |

## పోషకులు

| | | |
|---|---|---|
| శ్రీ దుర్గంపూడి శివ గోవింద సూర్యనారాయణరాజుగారు | గుండుగొలను | ప. గో. జిల్లా |
| శ్రీ నడింపల్లి తిరుపతిరాజుగారు | రేలంగి | ,, |
| శ్రీమతి వునికిలి సీతమ్మగారు | గుండుగొలను | ,, |

| | | |
|---|---|---|
| శ్రీ మహాదేవు సుబ్బరాజుగారు | గుండుగొలను | ప. గో. జిల్లా |
| శ్రీ బాదరవాడ నరసింహరాజుగారు | ,, | ,, |
| శ్రీ దుర్గంపూడి సత్యనారాయణరాజుగారు | ,, | ,, |
| శ్రీ వునికిలి గంగరాజుగారు | ,, | ,, |
| శ్రీ బాదరవాడ సుబ్బరాజుగారు | ,, | ,, |
| శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరస్వామిగారు | రేలంగి | ,, |
| శ్రీ సిర్గినీడి సూర్యారావుగారు | ,, | ,, |
| శ్రీ పెనుమత్స రామచంద్రరాజుగారు (బావరాజుగారు) | ,, | ,, |
| శ్రీ పసుపులేటి సుబ్బారావుగారు (బ్రహ్మన్న కుమారుడు) | ,, | ,, |
| శ్రీ చల్లపల్లి రామారావుగారు, కంట్రాక్టరు | విశాఖపట్టణం | |
| శ్రీమతి నిడుమోలు సుమతిగారు | విజయవాడ | కృష్ణా జిల్లా |
| శ్రీ రాకుర్తి బుల్లివెంకట్రాజుగారు | గుండుగొలను | ప. గో. జిల్లా |
| శ్రీమతి దుర్గంపూడి అన్నపూర్ణమ్మగారు | ,, | ,, |
| శ్రీమతి కొండ పార్వతమ్మగారు | ,, | ,, |
| శ్రీ కొండ పిచ్చిరాజుగారు | ,, | ,, |
| శ్రీ బుద్ధరాజు రామకృష్ణరాజుగారు | రేలంగి | ,, |
| శ్రీ గాదె వెంకటరత్నంగారు | ,, | ,, |
| శ్రీ యర్రంశెట్టి గంగరాజుగారి కుమారుడు వీరన్నగారు | ,, | ,, |
| శ్రీ యర్రంశెట్టి నరసయ్యగారి కుమారుడు వీరన్నగారు | ,, | ,, |
| శ్రీ పెనుమత్స కేశవరాజుగారి కుమారుడు విశ్వనాథరాజుగారు | ,, | ,, |
| శ్రీ పసుపులేటి సత్యనారాయణగారు | ,, | ,, |
| శ్రీ కొండ పాండురంగరాజుగారు | గుండుగొలను | ,, |
| శ్రీ కాపల్లి ధర్మరాజుగారు | ,, | ,, |
| శ్రీ కొండ గోపాలరాజుగారు | ,, | ,, |
| శ్రీ మావులేటి రాధాకృష్ణరాజుగారు | ,, | ,, |
| శ్రీ మావులేటి సూర్యనారాయణరాజుగారు | ,, | ,, |
| శ్రీమతి మావులేటి గంగాభవానమ్మగారు | ,, | ,, |
| శ్రీ కొండ శ్రీరామకృష్ణరాజుగారు మరియు శిష్యవర్గం | ,, | ,, |

# మనవి

నేను ప్రభుత్వ సంగీతకళాశాలలో అధ్యాపకుడుగ చేరక పూర్వము కచేరీలలో మృదంగము వాయించుటకు అనేకప్రదేశాలు తిరుగుతూ వుండేవాడిని. ఆరోజులలో మధ్వశ్రీ కాశీకృష్ణాచార్యులవారు అనేక పర్యాయములు నా మృదంగవాద్యమును విని మృదంగవాద్య విశేషములను గురించి యొక పుస్తకమును వ్రాయుమని నాకు సలహాయిస్తూ వుండేవారు. తమ యాశీస్సులున్నచో ప్రయత్నించెదనని అన్నాను. ఎక్కడ కనిపించినా పుస్తకమును వ్రాయుట నారంభించావా అని అడుగుచు నీవు తప్పక వ్రాయగలవు అని శ్రీకృష్ణాచార్యులవారు అనేవారు.

1960 సంవత్సరమున ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారు విజయవాడలో సంగీతకళాశాల నారంభించుట, నేను ఆ కళాశాలలో మృదంగాధ్యాపకుడుగ చేరుట జరిగినది. ప్రభుత్వమువారు నిర్ణయించిన ‘సెలబస్’ ప్రకారము విద్యార్థులకు లక్ష్యలక్షణములను బోధించుసమయమున శ్రీమాన్ శ్రీకృష్ణాచార్యులవారి హెచ్చరిక నాకు జ్ఞాపకము వచ్చి నన్ను యీ గ్రంథరచనకు ప్రోత్సహించినది. మరియు మాత్రాకాలములో మృదంగపాఠములు వ్రాసిన పుస్తకముకూడ నా కెచ్చటను కనపడలేదు. మాత్రాకాలములో లక్ష్యము వ్రాయవలయునను కుతూహలముతో నొక శుభ దినమున మద్గురువరేణ్యులు “మార్దంగికాగ్రేసర” బిరుదాంకితులు శ్రీ పాట్లూరి వీరరాఘవయ్యచౌదరిగారికి మనఃపూర్వక ప్రణామము లాచరించి శ్రీవారి యాశీస్సులతో గ్రంథరచన కుపక్రమించి మొదట చిత్తుప్రతి వ్రాసి శ్రీకృష్ణాచార్యుల వారికి విన్నవించుదామనుకొను చుండగనే వారు పరమపదించిరి. వారికి వినిపించు భాగ్యము పొందలేక పోయితినను బాధయున్నను వారి ఆశీస్సులు నా కెప్పుడు అండగా నుండునని నమ్మికతో రచన పూర్తిగావించితిని.

నా సహోధ్యాయులు, ఎల్లప్పుడు నా యభివృద్ధిని కోరు శ్రీ నర్రా గోపాలకృష్ణయ్యగారికి చూపించితిని. శ్రీ గోపాలకృష్ణయ్యగారు మా గురువర్యులవద్ద మృదంగం, కంజిరా విద్యలందు కృషి చేసినవారు. పదిహేనురోజులలో నా పుస్తకమంతయు చూచి దీనిని అచ్చువేయించిన పరీక్షాపద్ధతిలో నేర్చుకొనువారికి మిక్కిలి యుపయోగపడునని, ఇట్టి గ్రంథము ఇంతవరకు వెలువడలేదని నాకు సలహా యిచ్చి నన్ను ప్రోత్సహించినారు. నా యీ గ్రంథముద్రణకు ప్రోత్సహించిన శ్రీ గోపాలకృష్ణయ్యగారికి, పుస్తకరచనకై యాశీస్సులందించి ప్రేరేపించిన శ్రీమాన్ కాశీకృష్ణాచార్యులవారికి నా నమస్సుమాల నందిస్తున్నాను.

ప్రస్తుత గ్రంథమును గురించి నాలుగు మాటలు చెప్పుట అవసరము. ఈ గ్రంథములో వరుసగా చినపాలవరుసలు, పెదపాలవరుసలు, ఆది, రూపక, మిశ్రచాపు, త్రిశ్రరూపకము, త్రిశ్రత్రిపుట, తాళములను వ్రాసితిని. 35 తాళములకు జతులు వ్రాయుచు సులువుగా జ్ఞాపకముండుటకై ఒక్కొక్క తాళములోను అయిదు జాతులలోని జతులు ఒకే అక్షరముతో ప్రారంభించితిని. ఈ పద్ధతి నేర్చుకొను

విద్యార్థులకు చాల లాభదాయకము. ఈ క్రమము నిట్లు వ్రాయుటలో ప్రత్యేకతను పెద్దలు గమనించ గలరు. సున్నాలు అక్షరములుగా లెక్కపెట్టవద్దని, జతులుచ్చరించుటకు సౌలభ్యముకొరకే అవి వాడబడినవని విన్నవించుచున్నాను. లక్షణము చాలమంది పెద్దలు వ్రాసినారు. వాటినిచూచి పరీక్షా పద్ధతిలో వివిధములైన తరగతులవారికి అన్ని పరీక్షలకు ఈ గ్రంథస్థ విషయములు చాల యుపయోగకరము లని పెద్దలమాట. మృదంగవాద్య విశేషములను నా యథాశక్తి యీ గ్రంథమున పొందుపరచి పెద్దల మన్ననలకు పాత్రుడను కాగలిగితినని సవినయముగ మనవి చేయుచున్నాను. ఇట్టి గ్రంథము మృదంగ విద్యాసక్తులగు వారందరికి ఉపయోగకారియై బహుజనాదరణ పొందగలదని యాశించుచున్నాను.

నా యీ పుస్తకమును చూచి అభిప్రాయములను యిచ్చినవారికి, ముద్రణకు కావలసిన ద్రవ్యము నిచ్చి సహాయపడినవారికి నా కృతజ్ఞతాభివందనములు సమర్పించుకొంటున్నాను.

మహాదేవు రాధాకృష్ణరాజు

## ఆదితాళము వాయించువిధము

ఆదితాళము: పాఠములు, లఘువులోవున్న నాలుగు క్రియలు, రెండుచేతులతో కలిపి వాయించుచూ, మొదట ద్రుతము ప్రారంభమయినప్పుడు యెడమచేయి ఒక అక్షరము కుడిచేతితో కలిపి వాయిస్తూ, మిగిలిన పాఠము ఒక్క కుడిచేతితో వాయించవలెను. మిగిలిన రెండు ద్రుతములో పాఠములో వచ్చుమార్పును రెండు చేతులతో వాయించవలెను. పాఠమును బట్టి, మొదట ద్రుతములో ఒకటిగాని రెండుగాని అక్షరములు మాత్రమే యెడమచేయి కలుస్తూయుండును. యీ పద్ధతి పాఠమును బట్టి గమనించవలసియుండును.

## రూపకతాళము వాయించువిధము

రూపకతాళము: పాఠములు, ఒక ఆవృత్తము రెండు చేతులతో వాయిస్తూ, రెండవ ఆవృత్తము ప్రారంభములో మాత్రము, యెడమచేయి ఒక అక్షరము కలిపి, మిగిలిన పాఠము కుడిచేతితో మాత్రమే వాయిస్తూ, పాఠము చివరవచ్చే మార్పును రెండు చేతులతో వాయించవలెను. ఇట్లే మిగిలిన తాళములు, మిశ్రచాపు, త్రిశ్రరూపము, త్రిశ్రత్రిపుట వాయించవలసియుండును. ఈ నాలుగు తాళములందు రెండవ ఆవృత్తముయొక్క ప్రారంభమందు ఒకటిగాని, రెండుగాని అక్షరములు యెడమచేయి పాఠమును బట్టి కలుస్తూయుండును.

నేను వ్రాసిన అయిదు తాళములందు, ప్రతి తాళము చివర తగ్గింపులు వ్రాసియుంటిని.

ఉదాహరణ: ఆదితాళములో (తధీం తతధీం) అని మిశ్రజాతిగా తగ్గింపు వ్రాసితిని. వాయించునపుడు నాలుగు మిశ్రమములు రెండుచేతులతోను, మూడు మిశ్రమములు ఒక్కచేతితోను, చిన్న మార్పుతోవచ్చే చివర మిశ్రమము రెండుచేతులతోను మొత్తము యెనిమిది వాయించవలసియుండును. ఇట్లే ప్రతితాళమందు చివరవచ్చు తగ్గింపు జాతులను వాయించవలసియుండును.

చినపాలవరుసలు క్రియకు ఒక అక్షరము చొప్పున, పెదపాలవరుసలు, జంట వరుసలు క్రియకు రెండక్షరముల చొప్పున, ఆదితాళము, రూపకతాళము, మిశ్రచాపు తాళము, త్రిశ్రత్రిపుట తాళము క్రియకు నాలుగు అక్షరముల చొప్పున, త్రిశ్రరూపకతాళము, క్రియకు రెండక్షరముల చొప్పున వ్రాయడ మయినది. కావున పాఠములు వల్లించునపుడు పై విధము గమనించవలయును.

# మృదంగ బోధిని

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాన్తయే.

శారదా శారదాంభోజవదనా వదనాంబుజే
సర్వదా సర్వదాఽస్మాకం సన్నిధి స్సన్నిధింక్రియాత్

గురవే సర్వలోకానాం భిషజే భవరోగిణామ్
నిధయే సర్వవిద్యానాం దక్షిణామూర్తయే నమః

గురుర్బ్రహ్మ గురుర్విష్ణు గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షా త్పరబ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః

శ్రీరామచంద్రః శ్రిత పారిజాతః
సమస్తకల్యాణ గుణాభిరామః
సీతాముఖాంభోరుహ చంచరీకః
నిరంతరం మంగళ మాతనోతు.

# ప్రార్థనా శబ్దము

తోం తోం తక
తోం తోం తక
తకిట తకిట
తాత్తా ధీంతా తోంగా
తాం తాంతాం తాంతాం.

ఇది ప్రారంభమున ప్రార్థనకేగాని సాధనకుగాదు.

# 1-వ పాఠము

## ఆదితాళము — చినపాల వరుసలు

| | 1. లఘువు | | | | O. ద్రుతము | | O. ద్రుతము | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1. | త | ధి | తోం | నం | త | ధి | తోం | నం ‖ |
| | | | | 2 | | | | |
| 2. | త | త | ధి | ధి | తోం | తోం | నం | నం ‖ |
| | | | | 3 | | | | |
| 3. | త | త | త | . | ధి | ధి | ధి | . |
| | తోం | తోం | తోం | . | నం | నం | నం | . ‖ |
| | | | | 4 | | | | |
| 4. | త | త | త | త | ధి | ధి | ధి | ధి |
| | తోం | తోం | తోం | తోం | నం | నం | నం | నం |
| | | | | 5 | | | | |
| 5. | త | . | త | రి | ధి | . | త | రి |
| | తోం | . | త | రి | నం | . | త | రి ‖ |
| | | | | 6 | | | | |
| 6. | త | త | త | రి | ధి | ధి | త | రి |
| | తోం | తోం | త | రి | నం | నం | త | రి ‖ |
| | | | | 7 | | | | |
| 7. | త | త | త | రి | త | . | త | రి |
| | ధి | ధి | త | రి | ధి | . | త | రి |
| | తోం | తోం | త | రి | తోం | . | త | రి |
| | నం | నం | త | రి | నం | . | త | రి ‖ |

## రూపకతాళము

| | O. ద్రుతము | | 1. లఘువు | | | |
|---|---|---|---|---|---|---|
| 8. | త | . | త | రి | కి | ట |
| | ధి | . | త | రి | కి | ట |
| | తొం | . | త | రి | కి | ట |
| | నం | . | త | రి | కి | ట ‖ |
| | | | 2 | | | |
| 9. | త | త | త | రి | కి | ట |
| | ధి | ధి | త | రి | కి | ట |
| | తొం | తొం | త | రి | కి | ట |
| | నం | నం | త | రి | కి | ట ‖ |
| | | | 3 | | | |
| 10. | త | త | త | రి | కి | ట |
| | త | . | త | రి | కి | ట |
| | ధి | ధి | త | రి | కి | ట |
| | ధి | . | త | రి | కి | ట |
| | తొం | తొం | త | రి | కి | ట |
| | తొం | . | త | రి | కి | ట |
| | నం | నం | త | రి | కి | ట |
| | నం | . | త | రి | కి | ట ‖ |

## ఆదితాళము — పెదపాల వరుసలు

| | 1. లఘువు | | | | O. ద్రుతము | | O. ద్రుతము | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1. | తా | తరి | తరి | కిట | ధీ | తరి | తరి | కిట |
| | తోం | తరి | తరి | కిట | నాం | తరి | తరి | కిట ‖ |
| | | | | 2 | | | | |
| 2. | త త | రి / త | తరి / | కిట | ధిత | రి / ధి | తరి / | కిట |
| | తొంత | రి / తొం | తరి / | కిట | నంత | రి / నం | తరి / | కిట ‖ |

| | 1. లఘువు | | | | O. ద్రుతము | | O. ద్రుతము | |
|---|---|---|---|---|---|---|---|---|

### 3

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 3. | తా | తరి | తరి | కిట | తత | రి / త | తరి / | కిట |
| | ధీ | తరి | తరి | కిట | ధిత | రి / ధి | తరి / | కిట |
| | తోం | తరి | తరి | కిట | తొంత | రి / తొం | తరి / | కిట |
| | నాం | తరి | తరి | కిట | నంత | రి / నం | తరి / | కిట ‖ |

### 4

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 4. | తా | తరి | కిట | తా | తా | ర్రీ | కీ | టా |
| | ధీ | తరి | కిట | ధీ | తా | ర్రీ | కీ | టా |
| | తోం | తరి | కిట | తోం | తా | ర్రీ | కీ | టా |
| | నాం | తరి | కిట | నాం | తా | ర్రీ | కీ | టా ‖ |

### 5

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 5. | తా | తరి | కిట | తోం | తా | కా | ధీ | నా |
| | ధీ | తరి | కిట | తోం | తా | కా | ధీ | నా |
| | తోం | తరి | కిట | తోం | తా | కా | ధీ | నా |
| | నాం | తరి | కిట | తోం | తా | కా | ధీ | నా ‖ |

### 6

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 6. | తా | తరి | కిట | తా | తా | ర్రీ | కీ | టా |
| | తా | తరి | కిట | తోం | తా | కా | ధీ | నా |
| | ధీ | తరి | కిట | ధీ | తా | ర్రీ | కీ | టా |
| | ధీ | తరి | కిట | తోం | తా | కా | ధీ | నా |
| | తోం | తరి | కిట | తోం | తా | ర్రీ | కీ | టా |
| | తోం | తరి | కిట | తోం | తా | కా | ధీ | నా |
| | నాం | తరి | కిట | నాం | తా | ర్రీ | కీ | టా |
| | నాం | తరి | కిట | తోం | తా | కా | ధీ | నా ‖ |

| | 1. లఘువు | | | | O. ద్రుతము | | O. ద్రుతము | |
|---|---|---|---|---|---|---|---|---|

**7**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 7. | తా | తరి | తరి | కిట | తా | తా | తా | ది |
| | ధీ | తరి | తరి | కిట | ధీ | ధీ | తా | ది |
| | తోం | తరి | తరి | కిట | తోం | తోం | తా | ది |
| | నాం | తరి | తరి | కిట | నాం | నాం | తా | ది ॥ |

**8**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 8. | తా | తరికిట | కిట | తా | తా | ది | క్కి | టా |
| | ధీ | తరికిట | కిట | ధీ | తా | ది | క్కి | టా |
| | తోం | తరికిట | కిట | తోం | తా | ది | క్కి | టా |
| | నాం | తరికిట | కిట | నాం | తా | ది | క్కి | టా ॥ |

**9**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 9. | తా | తరికిట | కిట | తాం | తరికిట | తాం | తరికిట | తాంగిట |
| | ధీ | తరికిట | కిట | ధీ | తరికిట | తాం | తరికిట | తాంగిట |
| | తోం | తరికిట | కిట | తోం | తరికిట | తాం | తరికిట | తాంగిట |
| | నాం | తరికిట | కిట | నాం | తరికిట | తాం | తరికిట | తాంగిట ॥ |

**10**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 10. | తా | తరి | కిట | తక | తక | ధిన | తాం | గిట |
| | ధీ | తరి | కిట | తక | తక | ధిన | తాం | గిట |
| | తోం | తరి | కిట | తక | తక | ధిన | తాం | గిట |
| | నాం | తరి | కిట | తక | తక | ధిన | తాం | గిట ॥ |

**11**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 11. | తా | తరి | తరి | కిట | ధిసు | తక | తరి | కిట |
| | ధీ | తరి | తరి | కిట | ధిసు | తక | తరి | కిట |
| | తోం | తరి | తరి | కిట | ధిసు | తక | తరి | కిట |
| | నాం | తరి | తరి | కిట | ధిసు | తక | తరి | కిట ॥ |

| 1. లఘువు | | | | O. ద్రుతము | | O. ద్రుతము | | |
|---|---|---|---|---|---|---|---|---|

**12**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 12. | తాం | గిట | తక | ధీ | తరి | కిట | తక | ధిన |
| | ధీం | గిట | తక | ధీ | తరి | కిట | తక | ధిన |
| | తోం | గిట | తక | ధీ | తరి | కిట | తక | ధిన |
| | నాం | గిట | తక | ధీ | తరి | కిట | తక | ధిన ‖ |

**13**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 13. | తా | తరి | తరి | కిట | తక | తరి | తరి | కిట |
| | తరి | కిట | తాం | గిట | ధికు | తక | తరి | కిట |
| | ధీ | తరి | తరి | కిట | తక | తరి | తరి | కిట |
| | తరి | కిట | తాం | గిట | ధికు | తక | తరి | కిట |
| | తోం | తరి | తరి | కిట | తక | తరి | తరి | కిట |
| | తరి | కిట | తాం | గిట | ధికు | తక | తరి | కిట |
| | నాం | తరి | తరి | కిట | తక | తరి | తరి | కిట |
| | తరి | కిట | తాం | గిట | ధికు | తక | తరి | కిట ‖ |

**14**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 14. | తా | తరి | కిట | ధీ | తరి | కిట | తాం | గిట |
| | ధీ | తరి | కిట | తోం | తరి | కిట | తాం | గిట |
| | తోం | తరి | కిట | నాం | తరి | కిట | తాం | గిట |
| | కిట | తక | తాం | గిట | ధికు | తక | తరి | కిట ‖ |

**15**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 15. | తత | రికి | టతోం | . ధి | తరి | కిట | తోం . | తోం . |
| | ధిత | రికి | టతోం | . తోం | తరి | కిట | తోం . | తోం . |
| | తోంత | రికి | టతోం | . నం | తరి | కిట | తోం . | తోం . |
| | తక | ధిన | తాం | గిట | ధికు | తక | తరి | కిట ‖ |

1. లఘువు  0. ద్రుతము  0. ద్రుతము

### 16

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 16. | తా | .. | తా | తా | ధీ | నా | తా | .. |
| | తా | తా | ధీ | నా | తా | తా | ధీ | నా |
| | తా | తరి | కిట | ధీ | తరి | కిట | తోం | తరి |
| | కిట | నాం | తరి | కిట | ధికు | తక | తరి | కిట |
| | ధీ | .. | తా | తా | ధీ | నా | ధీ | .. |
| | తా | తా | ధీ | నా | తా | తా | ధీ | నా |
| | తా | తరి | కిట | ధీ | తరి | కిట | తోం | తరి |
| | కిట | నాం | తరి | కిట | ధికు | తక | తరి | కిట |
| | తోం | .. | తా | తా | ధీ | నా | తోం | .. |
| | తా | తా | ధీ | నా | తా | తా | ధీ | నా |
| | తా | తరి | కిట | ధీ | తరి | కిట | తోం | తరి |
| | కిట | నాం | తరి | కిట | ధికు | తక | తరి | కిట |
| | నాం | .. | తా | తా | ధీ | నా | నాం | .. |
| | తా | తా | ధీ | నా | తా | తా | ధీ | నా |
| | తా | తరి | కిట | ధీ | తరి | కిట | తోం | తరి |
| | కిట | నాం | తరి | కిట | ధికు | తక | తరి | కిట ‖ |

### 17

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 17. | తాం | గిట | తా | తా | ధీ | నా | తాం | గిట |
| | తా | తా | ధీ | నా | తా | తా | ధీ | నా |
| | తా | తరి | కిట | ధీ | తరి | కిట | తాం | గిట |
| | తా | ధీం | తరి | కిట | ధికు | తక | తరి | కిట |
| | ధీం | గిట | తా | తా | ధీ | నా | ధీం | గిట |
| | తా | తా | ధీ | నా | తా | తా | ధీ | నా |
| | తా | తరి | కిట | ధీ | తరి | కిట | తాం | గిట |

| | 1. లఘువు | | | O. ద్రుతము | | O. ద్రుతము | |
|---|---|---|---|---|---|---|---|
| తా | ధీం | తరి | కిట | ధికు | తక | తరి | కిట |
| తోం | గిట | తా | తా | ధీ | నా | తోం | గిట |
| తా | తా | ధీ | నా | తా | తా | ధీ | నా |
| తా | తరి | కిట | ధీ | తరి | కిట | తాం | గిట |
| తా | ధీం | తరి | కిట | ధికు | తక | తరి | కిట |
| నాం | గిట | తా | తా | ధీ | నా | నాం | గిట |
| తా | తా | ధీ | నా | తా | తా | ధీ | నా |
| తా | తరి | కిట | ధీ | తరి | కిట | తాం | గిట |
| తా | ధీం | తరి | కిట | ధికు | తక | తరి | కిట ॥ |

**18**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 18. | తా | తా | . . | తా | తా | తరి | తరి | కిట |
| | తా | తా | తా | తా | తా | తరి | తరి | కిట |
| | తా | తా | తా | తరి | తరి | కిట | తా | తా |
| | తా | తరి | తరి | కిట | తా | తరి | తరి | కిట |
| | తరి | కిట | తళం | . గు | ధికు | తక | తరి | కిట |
| | ధీ | ధీ | . . | ధీ | ధీ | తరి | తరి | కిట |
| | ధీ | ధీ | ధీ | ధీ | ధీ | తరి | తరి | కిట |
| | ధీ | ధీ | ధీ | తరి | తరి | కిట | ధీ | ధీ |
| | ధీ | తరి | తరి | కిట | ధీ | తరి | తరి | కిట |
| | తరి | కిట | తళం | . గు | ధికు | తక | తరి | కిట |
| | తోం | తోం | . . | తోం | తోం | తరి | తరి | కిట |
| | తోం | తోం | తోం | తోం | తోం | తరి | తరి | కిట |
| | తోం | తోం | తోం | తరి | తరి | కిట | తోం | తోం |
| | తోం | తరి | తరి | కిట | తోం | తరి | తరి | కిట |

| 1. లఘువు | | | O. ద్రుతము | | O. ద్రుతము | ( మృ. బో. 105 |
|---|---|---|---|---|---|---|
| | | | 22 | | | |
| ధిను / తత | ధిను / ధిను / | తత ధిను / | ధిను ధిను | తత ధిను | ధిను ధిను | తత ధిను |
| ధిను / తత | ధిను / ధిను / | తత ధిను / | . త ధిగి | ణత తధి | గిణ తత | ధిగి ణత ॥ |
| | | | 23 | | | |
| ధిను / తత | ధిను / ధిను / | తత ధిను / | ధిను ధిను | తత ధిను | ధిను ధిను | తత ధిను |
| ధిను తత | ధిను / ధిను | తత . త | ధిగి ణత | . త ధిగి | ణత . త | ధిగి ణత ॥ |
| | | | 24 | | | |
| ధిను / తత | ధిను / ధిను / | తత ధిను / | ధిను ధిను | తత ధిను | ధిను ధిను | తత ధిను |
| ధిను / తత | ధిను / ధిను | తత తధిం | . గిణ త | తధిం . గి | ణత తధిం | . గిణ త ॥ |
| | | | 25 | | | |
| ధిను / తత | ధిను / ధిను / | తత ధిను / | ధిను ధిను | తత ధిను | ధిను ధిను | తత ధిను |
| ధిను / తత | ధిను / ధిను | తధిం . గి | ణత . త | ధిం . గిణ | త . తధిం | . గిణ త ॥ |
| | | | 26 | | | |
| ధిను / తత | ధిను / ధిను / | తత ధిను / | ధిను ధిను | తత ధిను | ధిను ధిను | తత ధిను |
| ధిను తత | ధిను . త | . ధిం . గి | ణతత . | ధిం . గిణ | తత . ధిం | . గిణ త ॥ |
| | | | 27 | | | |
| ధిను / తత | ధిను / ధిను / | తత ధిను / | ధిను ధిను | తత ధిను | ధిను ధిను | తత ధిను |
| ధిను తత | . త . ధిం | . గిణ త | . త . ధిం | . గిణ త | . త . ధిం | . గిణ త ॥ |

| | 1. లఘువు | | O. ద్రుతము | | O. ద్రుతము | |
|---|---|---|---|---|---|---|
| | | | 28 | | | |
| ధిను / తత | ధిను / ధిను / | తత ధిను / | ధిను ధిను | తత ధిను | ధిను ధిను | తత ధిను |
| . త . ధిం | . గి . ణ | . తత . | ధిం . గి . | ణ . తత | . ధిం . గి | . ణ . త ॥ |
| | | | 29 | | | |
| ధిను / తత | ధిను / ధిను / | తత ధిను / | ధిను ధిను | తత ధిను | ధిను ధిను | తత . త |
| . ధిం . గి | . ణ . త | . త . ధిం | . గి . ణ | . త . త | . ధిం . గి | . ణ . త ॥ |
| | | | 30 | | | |
| ధిను / తత | ధిను / ధిను | తత ధిను / | ధిను ధిను | తత ధిను | ధిను ధిను | తత త . |
| . తొం . త | ధిగి ణత | త . . తొం | . తధి గి | ణతత . | . తొం . త | ధిగి ణత ॥ |
| | | | 31 | | | |
| ధిను / తత | ధిను / ధిను / | తత ధిను / | ధిను ధిను | తత ధిను | ధిను ధిను | తత తక |
| ధిత . త | ధిగి ణత | తక ధిను | . తధిగి | ణత తక | ధిను . త | ధిగి ణత ॥ |
| | | | 32 | | | |
| త . . . | . . . . | ధిను తత | ధిను / ధిను | తత ధిను / | ధిను తత | ధిను / ధిను |
| తత ధిను / | ధిను తత | ధిను / ధిను | తత ధిను / | ధిను తత | ధిను / తధిం | . గిణత |
| త . . . | . . . . | ధిను తత | ధిను / ధిను | తత ధిను / | ధిను తత | ధిను / ధిను |
| తత ధిను / | ధిను తత | ధిను / ధిను | తత ధిను / | ధిను తత | ధిను / తధిం | . గిణత |
| త . . . | ధిను తత | ధిను / ధిను | తత ధిను / | ధిను తత | ధిను / తధిం | . గిణత |
| త . . . | ధిను తత | ధిను / ధిను | తత ధిను / | ధిను తత | ధిను / తధిం | . గిణత |
| త . ధిను | తత ధిను / | తధిం . గి | ణ త త . | ధిను తత | ధిను / తధిం | . గిణత |
| . తధిం . | గిణత . | తధిం . గి | ణత / తధిం | . గిణత / | తధిం . గి | ణత / తధిం |
| . గిణత | తధిం . గి | ణత / తధిం | . గిణత / | తధిం . గి | ణత / తధిం | . గిణత ॥ |

1. లఘువు O. ద్రుతము O. ద్రుతము (మృ. జో. 107

**33**

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| త . . త | కిట త . | . తకిట | త . . త | కిటత . | . తకిట | తా ధీ |
| త . . త | కిట త . | . నకిట | త . . న | కిటత . | . నకిట | తక ధిన |
| త . . త | కిట త . | . తకిట | త . . త | కిటత . | . తకిట | తా ధీ |
| త . . త | కిట త . | . నకిట | త . . న | కిటత . | . నకిట | తక ధిన ॥ |

**34**

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| త . తకి | ట త . త | కిట తా | ధీ త . | తకి ట త | . నకిట | తక ధిన |
| త . తకి | ట త . త | కిట తా | ధీ త . | తకి ట త | . నకిట | తక ధిన |

**35**

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| త . . తరి | తరికిట త . | . తరి తరికిట | త . . తరి | తరికిట త . | . తరి తరికిట | తా ధీ |
| త . . తరి | తరికిట త . | . తరి తరికిట | త . . తరి | తరికిట త . | . తరి తరికిట | ధికుతక తరికిట |
| త . . తరి | తరికిట త . | . తరి తరికిట | త . . తరి | తరికిట త . | . తరి తరికిట | తా ధీ |
| త . . తరి | తరికిట త . | . తరి తరికిట | త . . తరి | తరికిట త . | . తరి తరికిట | ధికుతక తరికిట |

**36**

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| త . తరి తరి | కిట త . తరి | తరికిట తా | ధీ త . | తరి తరికిట త | . తరి తరికిట | ధికుతక తరికిట |
| త . తరి తరి | కిట త . తరి | తరికిట తా | ధీ త . | తరి తరికిట త | . తరి తరికిట | ధికుతక తరికిట |

1. లఘువు | O. ద్రుతము | O. ద్రుతము (మృ. బో. 108

**37**

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| త . తరి తరి | కిట తక తకతరి | కిటతక తకతరి | కిట తక తకతరి | కిటతక తకతరి | కిటతక తకతరి | కిటతక త . |
| . . తరి తరి | కిట తక తకతరి | కిటతక తకతరి | కిట తక తకతరి | కిటతక తకతరి | కిటతక తకతరి | కిటతక ధి . |
| త . తరి తరి | కిట తక తకతరి | కిటతక తకతరి | కిట తక తకతరి | కిటతక తకతరి | కిటతక తకతరి | కిటతక త . |
| . . తరి తరి | కిట తక తకతరి | కిటతక తకతరి | కిట తక తకతరి | కిటతక తకతరి | కిటతక తకతరి | కిటతక ధి . |
| త . తరి తరి | కిట తక తరికిట | తకతరి కిటతక | త . . . | తరి తరికిట తక | తరికిట తకతరి | కిటతక ధి . |
| త . తరి తరి | కిట తక తరికిట | తక / తరి కిటతక | త . . . | తరి తరికిట తక / | తరికిట తక / తరి | కిటతక ధి . |
| త . తరి కిట | తక త . . | . తరికిట తక | ధి . త . | తరికిట తక త | . . . తరి | కిటతక ధి . |
| త . తరి కిట | తక త . . | . తరికిట తక | ధికుతక తరికిట | తాంగిట ధికుతక | తరికిట తాంగిట | ధికుతక తరికిట |

**38**

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| తాంగిట ధికుతక | తరికిట తాంగిట | ధికుతక తరికిట | తాంగిట ధికుతక | తరికిట తాంగిట | ధికుతక తరికిట | ధికుతక తరికిట |
| తాంగిట ధికుతక | తరికిట నాంగిట | ధికుతక తరికిట | నాంగిట ధికుతక | తరికిట నాంగిట | ధికుతక తరికిట | ధికుతక తరికిట |
| తాంగిట ధికుతక | తరికిట తాంగిట | ధికుతక తరికిట | తాంగిట ధికుతక | తరికిట తాంగిట | ధికుతక తరికిట | ధికుతక తరికిట |
| తాంగిట ధికుతక | తరికిట నాంగిట | ధికుతక తరికిట | నాంగిట ధికుతక | తరికిట నాంగిట | ధికుతక తరికిట | ధికుతక తరికిట |

1. లఘువు — ౦. ద్రుతము — ౦. ద్రుతము



**39**

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| తాంగిట ధికుతక | తరికిట ధి . . . | తాంగిట ధికుతక | తరికిట తాంగిట | ధికుతక తరికిట | త . ధి . తాంగిట | ధికుతక తరికిట |
| తాంగిట ధికుతక | తరికిట ధి . . . | తాంగిట ధికుతక | తరికిట తాంగిట | ధికుతక తరికిట | తకధిన త . | తకధిన త . |
| తాంగిట ధికుతక | తరికిట ధి . . . | తాంగిట ధికుతక | తరికిట తాంగిట | ధికుతక తరికిట | త . ధి . తాంగిట | ధికుతక తరికిట |
| తాంగిట ధికుతక | తరికిట ధి . . . | తాంగిట ధికుతక | తరికిట తాంగిట | ధికుతక తరికిట | తకధిన త . | తకధిన త . |
| తాంగిట ధికుతక | తరికిట ధి . . . | తాంగిట ధికుతక | తరికిట తాంగిట | ధికుతక తరికిట | త . ధి . తాంగిట | ధికుతక తరికిట |
| తాంగిట ధికుతక | తరికిట ధి . . . | తాంగిట ధికుతక | తరికిట తాంగిట | ధికుతక తరికిట | తకధిన త . | తాంగిట ధికుతక |
| తరికిట ధి . . . | తాంగిట ధికుతక | తరికిట తాంగిట | ధికుతక తరికిట | తకధిన త . | తాంగిట ధికుతక | తరికిట త . ధి . |
| తాంగిట ధికుతక | తరికిట తాంగిట | ధికుతక తరికిట | ధికుతక తరికిట | తాంగిట ధికుతక | తరికిట తాంగిట | ధికుతక తరికిట ॥ |

**40**

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| తా ధీ | తక ధిన | త . . . | ధి . తక | ధినత . | . . తక | ధినత . |
| . త ధిగి | ణత తధిం | . గిణత | . . తధిం | . గిణత | . . తధిం | . గిణత |
| తా ధీ | తక ధిన | త . . . | ధి . తక | ధినత . | . . తక | ధినత . |
| . త ధిగి | ణత తధిం | . గిణత | . . తధిం | . గిణత | . . తధిం | . గిణత |
| తా ధీ | తక ధిన | త . . . | ధి . తక | ధినత . | . . తక | ధినత . |
| . తధిగి | ణత తధిం | . గిణత | . . తధిం | . గిణత | . . తధిం | . గిణత ॥ |
| త . . ధి | తక / తక | ధిత తక | ధికుతక తరికిట | తాంగిట ధికుతక | తరికిట తాంగిట | ధికుతక తరికిట ॥ |

## 35 తాళములకు జతులు

### 1. చ - ధ్రువతాళము - శ్రీకర

| I | O | I | I |
|---|---|---|---|
| తా త రి | కి ట | త రి కి ట | త క ధి న |

### 2. త్రి - ధ్రువతాళము - మణి

| I | O | I | I |
|---|---|---|---|
| త రి త | త క | ధ ణ త | ఝు ణు త |

### 3. మి - ధ్రువతాళము - పూర్ణ

| I | O | I | I |
|---|---|---|---|
| త త రి త రి కి ట | తాం | తా త ధి గి ణ త | తా ధీం గి ణ త |

### 4. ఖం - ధ్రువతాళము - ప్రమాణ

| I | O | I | I |
|---|---|---|---|
| తా త రి త | త క | ధీ త రి త | ధి త క ఝు ణు |

### 5. సం - ధ్రువతాళము - భువన

| I | O | I | I |
|---|---|---|---|
| తా త రి / త త రి త రి | కి ట | తా ధీ త ధి గి ణ త | తా ధీం గి ణా త |

### 6. చ - మఠ్యతాళము - సమ

| I | O | I |
|---|---|---|
| ధీ త రి | కి ట | త క ధి న |

### 7. త్రి - మఠ్యతాళము - సార

| I | O | I |
|---|---|---|
| ధి కి ట | తాం | త రి త |

8. మి - మఠ్యతాళము - ఉదీర్ణ

| I | O | I |
|---|---|---|
| ధ త రి త రి కి ట | తాం | తా ధిం గి ణ త |

9. ఖం - మఠ్యతాళము - ఉదయ

| I | O | I |
|---|---|---|
| ధీ త రి త | త క | ధి త క ఝు ణు |

10. సం - మఠ్యతాళము - రావ

| I | O | I |
|---|---|---|
| ధీ త రి / త త రి త రి | కి ట | తా ధీం గీ ణా త |

11. చ - రూపకతాళము - పత్తి

| O | I |
|---|---|
| త క | త క ధి న |

12. త్రి - రూపకతాళము - చక్ర

| O | I |
|---|---|
| త క | త రి త |

13. మి - రూపకతాళము - కుల

| O | I |
|---|---|
| త క | తా ధిం గి ణ త |

14. ఖం - రూపకతాళము - రాజ

| O | I |
|---|---|
| త క | ధి త క ఝు ణు |

15. సం - రూపకతాళము - బందు

| O | I |
|---|---|
| త క | తా ధీం గి ణా త |

16. చ . ఝంపతాళము - మధుర

| I | U | O |
|---|---|---|
| తోం గు డు | త | రి త |

17. త్రి - ఝంపతాళము - కదంబ

| I | U | O |
|---|---|---|
| తోం గు | త | రి త |

18. మి - ఝంపతాళము - సుర

| I | U | O |
|---|---|---|
| తోం గు డు ధి తోం | త | రి త |

19. ఖం - ఝంపతాళము - చణ

| I | U | O |
|---|---|---|
| తోం గి ణ త | త | రి త |

20. సం - ఝంపతాళము - కర

| I | U | O |
|---|---|---|
| తోం తోం త ధి గి ణ త | త | రి త |

21. చ - త్రిపుటతాళము - ఆది

| I | O | O |
|---|---|---|
| కి ట త క | త క | ధి న |

22. త్రి - త్రిపుటతాళము - శంఖ

| I | O | O |
|---|---|---|
| కి ట త | త క | ధి న |

23. మి - త్రిపుటతాళము - లీల

| I | O | O |
|---|---|---|
| కి ట త క త రి త | త క | ధి న |

24. ఖం - త్రిపుటతాళము - దుష్కర

| I | O | O |
|---|---|---|
| కి ట త రి త | త క | ధి న |

25. సం - త్రిపుటతాళము - భోగ

| I | O | O |
|---|---|---|
| కి ట తాం / ధి త క ఝు ణు | త క | ధి న |

26. చ - అటతాళము - లేఖ

| I | I | O | O |
|---|---|---|---|
| నాం గి ట | త రి కి ట | త క | ధి న |

27. త్రి - అటతాళము - గుప్త

| I | I | O | O |
|---|---|---|---|
| నం గి ట | తొం గి ట | త క | ధి న |

28. మి - అటతాళము - లోయ

| I | I | O | O |
|---|---|---|---|
| నం త రి త రి కి ట | త క ధి త క ఝు ణు | త క | ధి న |

29. ఖం - అటతాళము - విదళ

| \| | \| | O | O |
|---|---|---|---|
| న ం త రి కి ట | తో ం త రి కి ట | త క | ధి న |

30. సం - అటతాళము - ధీర

| \| | \| | O | O |
|---|---|---|---|
| నా ం గి ట / త త రి కి ట | తో ం తో ం త ధి గి ణ త | త క | ధి న |

31. చ - ఏకతాళము మాన

| \| |
|---|
| త క ధి న |

32. త్రి - ఏకతాళము - సుధ

| \| |
|---|
| త రి త |

33. మి - ఏకతాళము - రాగ

| \| |
|---|
| తా ధీ ం గి ణ త |

34. ఖం - ఏకతాళము - రత

| \| |
|---|
| త ధి గి ణ త |

35 సం. - ఏకతాళము - వసు

| \| |
|---|
| తా ధీ ం గి ణా త |

౦. ద్రు

తతధిగి ణతతధి

త . . ధి . . తాం . . త ధిగిణత తధిగిణ

త . . ధి . . తాం . . తధిగి ణతతధిగి ణత తధిగిణత

తధి గిణత త . . ధి . . తాం . . తధిగి

ఆదితాళము

## శబ్దపల్లవి మూడుకాలములు

| ల. ప్రథమకాలము O.

. ధి . గి . ణ . త . త . . ధి . . తాం . .

రెండవకాలము

ధిగిణత త . . ధి . . తాం . . త ధిగిణత తధిగిణ తత ధిగిణత త

మూడవకాలము

గిణత త . . ధి . . తాం . . తధిగి ణత తధిగిణ తతధిగిణత

తధి గిణత త . . ధి . . తాం . . తధిగి ణతత ధి

O. ద్రు O. ద్రు

తాం . . తధిగిణ తతధిగి ణతతధి

తత ధిగిణత త ధిగిణత త . . ధి . . తాం . . త ధిగిణత తధిగిణ

. . ధి . . తాం . . తధిగి ణతత ధిగిణత తధిగిణత

తధి గిణత త . . ధి . . తాం . . తధిగి ణతతధిగి ణత తధిగిణత

తధి గిణత త . . ధి . . తాం . . తధిగి

**మధ్యమకాల శబ్దపల్లవులు ఆదితాళము మూడు అక్షరములువిడచి యెత్తుకొనవలయును** (మృ. బో. 117

1. ల O. ద్రు O. ద్రు

. . . త . ధి . గి . ణ . త . త . . ధి . . తాం . . తధిగిణ తతధిగి ణతతధి
గిణత –

**రెండు అక్షరములు విడచి యెత్తుకొనవలయును**

. . త . ధి . త . తకధిన తాం / తక ధినతాం / తకధిన తాం . త ధిగిణత / తధిగిణ తతధిగి
ణత –

**మధ్యమకాల శబ్దపల్లవి త్రిశ్రజాతి త్రిపుటతాళము**

| ల. O. ద్రు O. ద్రు

త . . త రిత / ధణ త త . . ధి . . త . . త . ధి . త . ధి . త ధిగిణత

**మ్యధమకాల శబ్దపల్లవి చతురశ్రజాతి మఠ్యతాళము**

ల. | ద్రు. O ల. |

తా తకి ట / తకధి న / తకిట / తకధిన తాం . త . తధిగి ణతత . త ధిగిణ తత . త ధిగిణత

**మధ్యమకాల శబ్దపల్లవి మిశ్రజాతి రుంపతాళము**

ల. | అ. U ద్రు.

తాధీ తా తక ధిన ధీ తా తక ధినతా తకధిన తకధిన తాం . ష . ధి . త ధిగిణత ॥

**చ. ధ్రువతాళము మధ్యమకాల శబ్దపల్లవి**

ల. | ద్రు. O ల. | ల. |

తా . త కిటతాం తకిటత . తకిట తాం . త . ధి . త ధిగిణత త . ధి . తధిగిణ తత . ధి . తధిగి ణతతధి గిణతత ధిగిణత ॥

**ఖం. అటతాళము మధ్యమకాల శబ్దపల్లవి** (మృ. బో. 118

ల. | ల. | ద్రు. O ద్రు. O

ఖం. అటతాళము　　　　మధ్యమకాల శబ్దపల్లవి　　　　(మృ. బో. 118

ల. |　　　　ల. |　　　　ద్రు. O　　ద్రు. O

త . . .　త . ధి . త . ధి . త . త . తకధిన　త . . .　తరిత / ధ ణత / ఝుణు త / ధిమిత　తకధిన　త . . త　ధిగిణత　త . . త ధిగిణత ॥

త . ధి .　తకధిన　త . తక　ధినత . తకధిన　త . . .　తకధిన　త . తక　ధినత .　తకధిన　త . . త　తకఝుణు　త . . త　తకఝుణు ॥

ఖండజాతి త్రిపుట తాళము　　　　మధ్యమకాల శబ్దపల్లవి　　　　ఒక క్రియవిడచి యెత్తుకొనవలయును

| ల　　　　O. ద్రు　　　　O. ద్రు

. . . .　తరితత　. ధణత　త . ఝుణు　త త . . ధి . .　తాం . త　ధిగిణత　. తధిగి　ణత . త
ధిగిణత -

. . . .　త . రి .　కి . ట .　తకధిన తాంతక　ధినతాం తకధిన　తాం . త　ధిగిణత　. తధిగి　ణత . త
ధిగిణత -

. . తరి　తత . ,　ధణతత　. . ఝుణు　త త . . ధి . .　తాం . .　. . తధిం　. గిణత　తధిం . గి
ణత -

చ॥ రూపకతాళము మధ్యమకాల శబ్దపల్లవి　　రెండక్షరములు విడిచి యెత్తవలెను

ద్రు. O　　　　ల. |

. . త . . ధి . .　త . . త　ధిగిణత　తధిగిణ　తతధిగి
ణత

# సప్తతాళముల పుట్టుక

పూర్వము ప్రదోషకాలమందు ఈశ్వరుడు తాండవముచేయు సమయమున పాదమునుండి అందె జారి భూమియందు పడెను. అప్పుడు కలిగిన ధ్వని "తకిటత", "ధరికిట", "దధిగిణ" "ఝుణు ఝుంత" అని పదియారు శబ్దము లయినట్లును, ఈ పదియారు శబ్దముల కాలము కాకపాద మయినట్లు చెప్పుదురు. కాకపాదమును ప్రస్తరించగ కలిగిన తాళములు ఆదితాళభేదములని కూడ చెప్పుదురు. కాకపాదమందు రెండక్షరములు మినహాయించిన ధ్రువతాళమనియు, ధ్రువతాళమందు రెండక్షరములు మినహాయించిన అటతాళమనియు, అటతాళమందు రెండక్షరములు మినహాయించిన మఠ్యతాళమనియు, మఠ్యతాళమందు రెండక్షరములు మినహాయించిన త్రిపుటతాళమనియు, త్రిపుటతాళమందు రెండక్షరములు మినహాయించిన రూపకతాళమనియు, రూపకతాళమందు రెండక్షరములు మినహాయించిన ఏకతాళమనియు చెప్పుచున్నారు. పైన పేర్కొన్న తాళములలో క్రమముగ 16, 14, 12, 10, 8, 6, 4 అక్షరము లుండును. ఈ తాళము లన్నింటెని శాస్త్రజ్ఞులు వేరుపరచి వాటికి లక్షణము వ్రాసిరి. నిశ్శబ్దక్రియ లయినందున కాక పాదమును ఈ తాళములనుంచి తొలగించి యున్నారు. అందుచే ఆరు తాళములే అయినవి. ఈ ఆరు తాళములలో అనుద్రుతము లేనందున రూపకతాళములోయున్న రెండు అంగములను తీసికొని ముందు లఘువు, మధ్యన అనుద్రుతము, చివర ద్రుతము చేర్చి ఝంపతాళము అను నామమును శాస్త్రజ్ఞులు నిర్ణయించిరి. ఝంపతాళముతో కలసి మొత్తము ఏడు తాళము లయినవి. ఈ ఏడు తాళములు మొదట చతురశ్రజాతిలోనే పుట్టినట్లుగ భావించవలెను. జాతి పేరు లేకుండ తాళ మడిగిన చతురశ్రజాతి తాళముగానే అనుష్ఠించ వలెను.

## సప్తతాళములు

ధ్రువ, మఠ్య, రూపక, ఝంప, త్రిపుట, అట, ఏక అను పేర్లతో సప్తతాళములు వాడబడుచున్నవి.

| నెం. | పేర్లు | అంగములు | క్రియలు |
|---|---|---|---|
| 1 | ధ్రువ తాళము | I O I I | 14 |
| 2 | మఠ్య తాళము | I O I | 10 |
| 3 | రూపక తాళము | O I | 6 |
| 4 | ఝంప తాళము | I U O | 7 |
| 5 | త్రిపుట తాళము | I O O | 8 |
| 6 | అట తాళము | I I O | 12 |
| 7 | ఏక తాళము | I | 4 |

ఈ సప్త తాళములు అనుద్రుతము, ద్రుతము, లఘువు అను మూడు అంగములతో ఏర్పడినవి. అనుద్రుతము, ద్రుతము ఎప్పుడు మార్పుచెందక నొక విధముగనే వాడబడును. లఘువు జాతులవలన మార్పుచెందుచుండును. అనుద్రుతము అరచేతి ఘాతయను హస్తక్రియ ఒకటి. ద్రుతమునకు ఘాత, ఉశి అను హస్తక్రియలు రెండు. ఘాతనువేసి వ్రేళ్లను ఎంచుట లఘువు అందురు. అర్ధానుస్వారము అనుద్రుతమునకు, అనుస్వారము ద్రుతమునకు, నిలువుగీటు లఘువునకు చిహ్నములు.

అంగముల చిహ్నములు : అ ద్రు ల

U O |

**జాతులు**

చతురశ్ర, త్రిశ్ర, మిశ్ర, ఖండ, సంకీర్ణము అను జాతుల వలన ధ్రువాది సప్త తాళములు ఒక్కొక్కటి అయిదేసి విధము లగుచున్నవి. తాళాంగము నందలి లఘువు ననుసరించి ఈ జాతులు ఏర్పడినవి.

| నెం. | పేర్లు | అక్షరములు |
|---|---|---|
| 1 | చతురశ్రజాతి | 4 |
| 2 | త్రిశ్రజాతి | 3 |
| 3 | మిశ్రజాతి | 7 |
| 4 | ఖండజాతి | 5 |
| 5 | సంకీర్ణజాతి | 9 |

ఈ అయిదు జాతుల ననుసరించి ధ్రువాది సప్తతాళములు ఒక్కొక్క తాళము అయిదేసి తాళము లగుచున్నవి. కాబట్టి తాళములు 7, జాతులు 5. 7 × 5 = 35 తాళము లగుచున్నవి.

## 1. ధ్రువతాళము

భరత, దత్తిల, ఆంజనేయ మతముల ననుసరించి ధ్రువతాళ మేర్పడినది.

**లక్షణము**

ఒక లఘువు, ఒక ద్రుతము, తరువాత రెండు లఘువులు గలిగి ఆవర్తమునకు చతురశ్రజాతి క్రియలు 14 కలిగియున్న తాళము ధ్రువతాళము.

ఉదాహరణము : తాళాంగములు ... | O | |

క్రియలు ... 4+2+4+4 = 14

## 2. మఠ్యతాళము

మతంగుడు, అర్జునుడు, కోహలుడు మఠ్యతాళము చెప్పిరి.

### లక్షణము

మొదట లఘువు, తరువాత ద్రుతము, లఘువు గలిగి ఆవర్తమునకు చతురశ్రజాతి క్రియలు పది గలిగి యుండునది మఠ్యతాళము.

ఉదాహరణము : తాళాంగములు ...... | O |

క్రియలు ...... 4+2+4 = 10

## 3. రూపకతాళము

ఆంజనేయులు, అగస్త్యుడు, యాజ్ఞవల్క్యముని, రూపకతాళము చెప్పిరి.

### లక్షణము

మొదట ద్రుతము, తరువాత లఘువు గలిగి ఆవర్తమునకు చతురశ్రజాతిక్రియలు ఆరు గలిగి యుండునది రూపకతాళము.

ఉదాహరణము : తాళాంగములు ...... O |

క్రియలు ...... 2+4 = 6

## 4. ఝంపతాళము

నందికేశ్వరుడు, భరతుడు, శౌనకుడు ఝంపతాళము చెప్పిరి.

### లక్షణము

మొదట ఒక లఘువు, తరువాత అనుద్రుతము, ద్రుతము గలిగి ఆవర్తమునకు చతురశ్రజాతి క్రియలు ఏడు గలిగి యుండునది ఝంపతాళము.

ఉదాహరణము : తాళాంగములు ...... | U O

క్రియలు ...... 4+1+2 = 7

## 5. త్రిపుటతాళము

రావణుడు, బ్రహ్మ, శంఖపాలుడు త్రిపుటతాళము చెప్పిరి.

### లక్షణము

మొదట లఘువు, తరువాత రెండు ద్రుతములుగలిగి ఆవర్తమునకు చతురశ్రజాతి క్రియలు ఎనిమిది గలిగి యుండునది త్రిపుటతాళము.

ఉదాహరణము : తాళాంగములు ... | O O

క్రియలు ... 4+2+2 = 8

## 6. అటతాళము

బలిచక్రవర్తి, దేవేంద్రుడు, కుమారస్వామి అటతాళము చెప్పిరి.

### లక్షణము

మొదట రెండు లఘువులు, తరువాత రెండు ద్రుతములు గలిగి ఆవర్తమునకు చతురశ్రజాతి క్రియలు పన్నెండు గలిగి యుండునది అటతాళము.

ఉదాహరణము : తాళాంగములు ... I I O O

క్రియలు ... 4+4+2+2 = 12

## 7. ఏకతాళము

పెద్దలందరూ కలసి ఏకతాళము చెప్పిరి.

### లక్షణము

ఒక్క లఘువు గలిగి ఆవర్తమునకు చతురశ్రజాతి క్రియలు నాలుగు కలిగి యుండునది ఏకతాళము.

### క్రియ

క్రియ అనగ తాళము యొక్క ఆవర్తమునందు కొట్టుట, విసరుట, ఎంచుట, చుట్టుట మొదలగు పనులచే తాళమునగల అంగములను జూపించుట క్రియ అనబడును.

### అంగము

అంగము అనగ తాళమునగల క్రియల వరుసక్రమము చూచి అంగములుగ విభజించిరి. అవి ఆరు విధములుగ నున్నవి.

1. అనుద్రుతము 2. ద్రుతము 3. లఘువు 4. గురువు 5. ప్లుతము 6. కాకపాదము అని ఆరు అంగములుగ ఏర్పరచిరి.

## 1. సశబ్దక్రియ

అనగా ఎడమచేతిమీద కుడిచేతితో శబ్దము కలుగునట్లు కొట్టుట సశబ్దక్రియ యనబడును.

## 2. నిశ్శబ్దక్రియ

అనగా వ్రేళ్లను యెంచుట, కుడిచేతిని క్రిందకు దించుట, విసరుట, పైకి ఎత్తుట మొదలగు శబ్దరహితక్రియలు నిశ్శబ్దక్రియ లనబడును.

| సెం. | అంగముల పేర్లు | అంగసంజ్ఞలు | అక్షరములు | వినియోగం |
|---|---|---|---|---|
| 1 | అనుద్రుతము | U | 1 | ధ్రువక |
| 2 | ద్రుతము | O | 2 | ధ్రువక, విసర్జిత |
| 3 | లఘువు | । | 4 | ధ్రువక, విక్షిప్త లేక వ్రేళ్లను ఎంచుట |
| 4 | గురువు | ઠ | 8 | ధ్రువక, పతిత |
| 5 | ప్లుతము | ।ઠ | 12 | ధ్రువక, సర్పిణి, పతిత |
| 6 | కాకపాదము | + | 16 | సర్పిణి, కృష్య, పతాక, పతిత |

## 1. షడంగముల వినియోగము

### 1. అనుద్రుతము

ఈ అంగము ధ్రువకక్రియతో వాడబడుచున్నది. సప్తతాళములలో ఒక్క ఝంపతాళములో మాత్రమే ఈ అంగము వచ్చుచున్నది. ఇది శబ్దక్రియ. ఎడమచేతిపై కుడిచేతితో శబ్దము కలుగునట్లు కొట్టుట "ధ్రువక" లేక "ఘాత" అందురు. దీనిని అనుద్రుత మందురు.

### 2. ద్రుతము

ద్రుతము ధ్రువక, విసర్జిత అను రెండు క్రియలతో వాడబడుచున్నది. మొదటిది శబ్దక్రియ, రెండవది నిశ్శబ్దక్రియ. ఎడమచేతియందు కుడిచేతితో కొట్టుట ధ్రువక. కుడిచేతిని పైకి విసరుట విసర్జిత. ఈ రెండు క్రియలు కలసి ద్రుతమనబడును.

### 3. లఘువు

లఘువు ధ్రువక, విక్షిప్త అను రెండు నామములతో వాడబడుచున్నది. ఎడమ చేతిపై కుడిచేతితో కొట్టుట ధ్రువక. చిటికెనవ్రేలు మొదలు వ్రేళ్లను లెక్కించుట విక్షిప్త లఘు వనబడును.

### 4. గురువు

గురువు ధ్రువక, పతిత అను నామములతో వాడబడుచున్నది. ఎడమ చేతి మీద కుడిచేతితో దెబ్బకొట్టుట ...: ధ్రువక

వ్రేళ్లను ఎంచుట ...: విక్షిప్త

కుడిచేతిని నాలుగు అక్షరముల కాలము క్రిందకు దించుట పతిత — గురువు అనబడును.

## 5. ప్లుతము

ప్లుతము : దీని ప్రమాణము మూడు లఘువుల కాలము. అనగ పన్నెండు అక్షరములు. ధ్రువక, సర్పిణి, పతిత అను మూడు లఘువులతో వాడబడుచున్నది. ఎడమ చేతియందు కుడిచేతితో శబ్దము కలుగునట్లు కొట్టుట...: ధ్రువక

మూడువ్రేళ్లను ఎంచుట ...: విక్షిప్త

కుడిచేతిని ఎడమచేతి చుట్టూ నాలుగక్షరముల కాలము చుట్టి — సర్పిణి

కుడిచేతిని నాలుగక్షరముల కాలము క్రిందకు దించుట — పతిత ( ప్లుతమనబడును )

## 6. కాకపాదము

కాకపాదము : దీని ప్రమాణము నాలుగు లఘువుల కాలము. పదియారు అక్షరములు. సర్పిణి, కృష్య, పతాక, పతిత యను నాలుగు లఘువులతో వాడబడు చున్నది. ఇది నిశ్శబ్ద అంగమగుటచే అంత వాడుకలో లేదని చెప్పవచ్చును. పదియారు అక్షరముల కాలము నిశ్శబ్దక్రియలగుటచే కుడిచేతిని నాలుగక్షరముల కాలము ఎడమ ప్రక్కకు గొని వచ్చి ...: సర్పిణి

పిమ్మట ఆ చేతిని నాలుగక్షరముల కాలము కుడివంకకు త్రిప్పుకొనివచ్చి — కృష్య

అదేచేతిని నాలుగక్షరముల కాలము పైకి ఎత్తి — పతాక

అట్లు ఎత్తిన చేతిని నాలుగు అక్షరముల కాలము క్రిందకు దించుట — పతిత

కాకపాద మనబడును. దీనిని నిశ్శబ్ద చతుర్లఘువనికూడ వాడుచున్నారు. దీనిని కాకపాద మందురు.

## తాళదశప్రాణములు

కాలము, మార్గము, క్రియ, అంగము, గ్రహము, జాతి, కళ, లయ, యతి, ప్రస్తారము అనునవి తాళమునకు దశప్రాణములు. ఈ పదిప్రాణములు ప్రతి తాళమునకు ఉండును. పదివిధములయిన నియమములకు పదిప్రాణములని వ్యవహారము. ఈతాళదశ ప్రాణములలో ఈ పదిఅంశములలో, మొదటి అయిదు ప్రాణములు, కాలము, మార్గము, క్రియ, అంగము, గ్రహము ముఖ్యప్రాణములనియు, మిగిలిన అయిదు ప్రాణములు, జాతి, కళ, లయ, యతి ప్రస్తారము ఉపప్రాణములనియు అనబడుచున్నవి.

ఈ దశప్రాణములు పైన వరుసక్రమములో నున్నను విద్యార్థులకు సులభముగ బోధపడుటకుగాను కాలము, మార్గము, క్రియ, అంగము, గ్రహము, జాతి, కళ, లయ, యతి, ప్రస్తారము అను వరుస క్రమములో వివరించుచున్నారు. ఈ దశప్రాణలక్షణములు క్రింద వివరింపబడినవి.

## 1. కాలప్రాణ లక్షణము

నూరు తామర రేకుల నొకదానిపై నొకటి బొత్తిగా పెట్టి వాటిని సూదిచే ఛేదించిన నూరు తామర రేకులు తెగిన కాలము ఒక క్షణ మగును.

| | | |
|---|---|---|
| 8 | క్షణములు | ఒక లవము |
| 8 | లవములు | ఒక కాష్ఠ |
| 8 | కాష్ఠలు | ఒక నిమిషము |
| 8 | నిమేషములు (రెప్పపాటు) | ఒక కళ |
| 2 | కళలు | ఒక చతుర్భాగము |
| 2 | చతుర్భాగములు | ఒక అనుద్రుతము |
| 2 | అనుద్రుతములు | ఒక ద్రుతము |
| 2 | ద్రుతములు | ఒక లఘువు |
| 2 | లఘువులు | ఒక గురువు |
| 3 | లఘువులు | ఒక ప్లుతము |
| 4 | లఘువులు | ఒక కాకపాదము |

ఈప్రకారము కాల ప్రాణలక్షణము తెలియవలెను.

కాలము = తాళముయొక్క అంగముల కాలప్రమాణమును నిర్ధారణముగ చెప్పెడి అంశము కాలప్రాణ మనబడుచున్నదని చెప్పవచ్చును. ఇది సూక్ష్మకాలమనియు, స్థూలకాలమనియు రెండు విధములు. క్షణము, లవము, కాష్ఠ, నిమేషము, కళ, చతుర్భాగము అను ఆరును సూక్ష్మకాలమనియు; అనుదృతము, ద్రుతము, లఘువు, గురువు, ప్లుతము, కాకపాదము అను ఆరును స్థూలకాల మనియును అనబడును.

## 2. మార్గప్రాణ లక్షణము

తాళము వేయునప్పుడు ఒక్కొక్క హస్తక్రియను ఎంతకాలము వరకు నిలుపవలయునో ఆ నియమములను ఈ మార్గ ప్రాణ లక్షణము వలన తెలియగలరు. తాళము నడచు మార్గములను తెలుపును కాబట్టి దీనికి ఈపేరు వచ్చినది.

**షణ్మార్గములు :** దక్షిణము, వార్తికము, చిత్రము, చిత్రతరము, చిత్రతమము, అతిచిత్రతమము అని ఆరు మార్గములు.

**లక్షణము**

| | | |
|---|---|---|
| 1 | దక్షిణ మార్గము | 8 మాత్రల కాలము |
| 2 | వార్తిక మార్గము | 4 మాత్రల కాలము |
| 3 | చిత్ర మార్గము | 2 మాత్రల కాలము |
| 4 | చిత్రతర మార్గము | 1 మాత్ర కాలము |
| 5 | చిత్రతమ మార్గము | ½ మాత్ర కాలము |
| 6 | అతిచిత్రతమ మార్గము | ¼ మాత్ర కాలము |

సప్తతాళములు ప్రథమమున చతురశ్రజాతిలోనే పుట్టినందున మాత్ర యనగా నాలుగు అక్షరములు గల చతురశ్రమాత్ర యని తెలియవలెను. ఈ పద్ధతి ననుసరించి,

| | | | |
|---|---|---|---|
| 1 | దక్షిణ మార్గమునకు | 8 × 4 = 32 | అక్షరములు |
| 2 | వార్తిక మార్గమునకు | 4 × 4 = 16 | అక్షరములు |
| 3 | చిత్ర మార్గమునకు | 2 × 4 = 8 | అక్షరములు |
| 4 | చిత్రతర మార్గమునకు | 1 × 4 = 4 | అక్షరములు |
| 5 | చిత్రతమ మార్గమునకు | $\frac{1}{2}$ × 4 = 2 | అక్షరములు |
| 6 | అతిచిత్రతమ మార్గమునకు | $\frac{1}{4}$ × 4 = 1 | అక్షరము |

అయినవి.

## తాళములందు మార్గములను వినియోగించు క్రమము

తాళము వేయునప్పుడు ఒక్కొక్క హస్తక్రియను 32 అక్షరముల కాలము వంతున నిలుపుచు తాళమును అనుష్ఠించిన అప్పుడు తాళము దక్షిణ మార్గమున నడచుచున్నట్లు ఎంచవలయును. ఇట్లే వార్తికాది మార్గములలో తాళములను నడుపునపుడు తాళము నందలి హస్తక్రియలను ఆ యా మార్గ కాలములో నిలుపవలయును. ప్రతిమార్గములోను మార్గ కాలమందు ప్రథమకాల అక్షరములకు రెట్టింపు అక్షరములను ఉచ్చరించిన రెండవ కాలమగును. అనగా పై ప్రథమకాల అక్షరములను రెట్టింపు తొందరగా రెండు పర్యాయములు ఆకాలమందే ఉచ్చరించవలెను. అదేవిధమున నాలుగు పర్యాయములు ఆ కాలములోననే నాలుగురెట్లు తొందరలో ఉచ్చరించుట మూడవకాల మగును. అతి చిత్రతర మార్గములో రెండవ కాలమున ‘‘ తక ’’ అనియు మూడవ కాలమున ‘‘ తక తక ’’ అనియును ఉచ్చరించవలయును. ( తాళావర్తమందలి హస్తక్రియలన్నిటిని ఒక మార్గము లోననే నడుపవలయును. ఒక తాళములో ఏకకాలమందు రెండు మార్గములను అనుష్ఠింపగూడదు. )

## 3. క్రియాప్రాణ లక్షణము

రెండు హస్తములయొక్క సంయోగ వియోగముల వలన తాళక్రియలు కలుగు చున్నవి. తాళము వేయునప్పుడు రెండుచేతులతో చేయు సంజ్ఞలే క్రియలు. హస్తముల వలన కలుగుచున్నవి గాన హస్తక్రియ లనబడినవి.

**క్రియలు** రెండు **విధములు.** హస్తక్రియలు మార్గము లనియు, దేశీయము లనియు రెండు విధములు. అందు మార్గక్రియలు నిశ్శబ్దము లనియు, శబ్దయుక్తము లనియు రెండు విధములు. మార్గ నిశ్శబ్దక్రియలకు కళలని పేరు.

1. **మార్గనిశ్శబ్దక్రియలు :** ఆవాపము, నిష్క్రామము, విక్షేపము, ప్రవేశము అనునవి నాలుగు మార్గనిశ్శబ్దక్రియలు,

**లక్షణము**

1. ఆవాపము : పైకి ఎత్తబడిన హస్తము యొక్క వ్రేళ్లను ముడుచుట.
2. నిష్క్రామము : పైన చెప్పిన ఆవాప హస్తమునందు ముడిచిన వ్రేళ్లను విప్పుట లేక చాచుట. దీనిని క్రిందుగా తీసుకురావలెను.
3. విక్షేపము : నిష్క్రామ హస్తమును కుడిపార్శ్వమున వెలుపలకు విసరుట.
4. ప్రవేశము : విక్షేప హస్తమును అధోముఖముగా వ్రేళ్లను వంచి తనవైపునకు తెచ్చుట.

## 2. మార్గశబ్ద క్రియలు

ధ్రువము, శమ్యము, తాళము, సన్నిపాతము అనునవి నాలుగు మార్గశబ్ద క్రియలు.

**లక్షణము**

1. ధ్రువము : శబ్దపూర్వకమయిన చిటుక.
2. శమ్యము : కుడిచేతియందు ఎడమచేతితో దెబ్బకొట్టుట.
3. తాళము : ఎడమ హస్తమునందు కుడిచేతితో దెబ్బకొట్టుట.
4. సన్నిపాతము : రెండు హస్తముల ఘాత. తనకు అభిముఖంగా రెండు హస్తములతో నమస్కరించినటుల దెబ్బకొట్టుట.

## 3. దేశ్యక్రియలు

ధ్రువక, సర్పిణి, కృష్య, పద్మిని, విసర్జిత, విక్షిప్త, పతాక, పతిత అని ఎనిమిది దేశ్యక్రియలుగా తెలిపిరి.

**లక్షణము**

1. ధ్రువక : దెబ్బకొట్టుట.
2. సర్పిణి : కుడిచేతిని నాలుగక్షరముల కాలము ఎడమప్రక్కకు కొనివచ్చుట.
3. కృష్య : కుడిచేతిని నాలుగక్షరముల కాలము కుడివంకకు త్రిప్పుకొనివచ్చుట.
4. పద్మిని : అరచేతిని క్రిందుగాజేసి అధోముఖముగా చేతిని చాచుట.
5. విసర్జిత : కుడిచేతిని పైకి విసరుట.
6. విక్షిప్త : చిటికెనవ్రేలు మొదలు వ్రేళ్లను ఎంచుట.
7. పతాక : కుడిచేతిని నాలుగు అక్షరముల కాలము పైకి ఎత్తుట.
8. పతిత : కుడిచేతిని నాలుగు అక్షరములకాలము క్రిందకు దించుట.

## 4. అంగప్రాణ లక్షణము

ఒక హస్తక్రియనుగాని, ఒకటికి మించిన హస్తక్రియలనుగాని తెలియజేయునట్టి సంజ్ఞకు అంగ మనిపేరు. ఒక అంగము లేక ఒకటికి మించిన అంగముల వలన తాళము ఏర్పడుచున్నది. ఇట్టి అంగములు పదియారు గలవు. ఇవి కాకపాదము నుండి ఏర్పడినవి. కాకపాదమునందు ఒక్కొక్క అనుద్రుతమును తగ్గించుచూ వచ్చిన 16 అంగములు ఏర్పడును. ఈ అంగముల వలన తాళములు ఏర్పడుచున్నందున ఇవి తాళాంగము లనబడినవి.

### షోడశాంగములు

| | | |
|---|---|---|
| 1. | కాకపాదము | + |
| 2. | ప్లుతద్రుత విరామము | ర । ఽ |
| 3. | ప్లుతద్రుతము | ೦ । ఽ |
| 4. | ప్లుత విరామము | ∪ । ఽ |
| 5. | ప్లుతము | । ఽ |
| 6. | గురుద్రుత విరామము | ర ఽ |
| 7. | గురుద్రుతము | ೦ ఽ |
| 8. | గురు విరామము | ∪ ఽ |
| 9. | గురువు | ఽ |
| 10. | లఘుద్రుత విరామము | ర । |
| 11. | లఘు ద్రుతము | ೦ । |
| 12. | లఘు విరామము | ∪ । |
| 13. | లఘువు | । |
| 14. | ద్రుత విరామము | ర |
| 15. | ద్రుతము | ೦ |
| 16. | అనుద్రుతము | ∪ |

అనుద్రుతమనినను, విరామమనినను ఒకటిగానే గ్రహించవలెను. ఈ అంగములు మార్గతాళమందు వినియోగ మగును. పై షోడశాంగములలో ద్రుత విరామము, లఘు విరామము, లఘుద్రుత విరామము, గురు విరామము అను అంగములు లఘువు జాతి మార్పును పొందునపుడు వచ్చుచున్నవి.

లఘుద్రుతము, గురుద్రుతము, గురుద్రుత విరామము, ప్లుత విరామము, ప్లుత ద్రుతము, ప్లుతద్రుత విరామము అను అంగములను పూర్వము మార్గతాళములో వినియోగించుకొనుచుండిరి. అనుద్రుత, ద్రుత, లఘు, గురు, ప్లుతములలో పై అంగములు అంతర్భూతమ్ములై వున్నవి. అనుద్రుత, ద్రుతములను ప్రత్యేక తాళాంగములుగా చెప్పుచున్నందున పై అంగములను వివరించుట లేదు. సంకీర్ణ లఘువునకు వలెనే పై అంగములు అధికాక్షరములలో నిలుపుకొని ఏకాంగమ్ముగనే మార్గతాళమ్ములందు వినియోగించుకొనవలయును.

## షడంగములు

అనుద్రుతము, ద్రుతము, లఘువు, గురువు, ప్లుతము, కాకపాదము అని తాళాంగములు ఆరు విధములు.

| | | | |
|---|---|---|---|
| 1. | అనుద్రుతము | అర్ధచంద్రాకారము | U |
| 2. | ద్రుతము | వలయాకారము | O |
| 3. | లఘువు | బాణమువలె నిలువు గీటు | \| |
| 4. | గురువు | వక్రధనుస్సాకారము | S |
| 5. | ప్లుతము | శరముతోగూడిన గురువు | \|S |
| 6. | కాకపాదము | హంసపాదము | + |

## షడంగముల యొక్క పేర్లు

1. **అనుద్రుతము :** అనుద్రుతము, అర్ధచంద్రము, వ్యంజనము, అనునాసికము, అవ్యక్తము, విరామము, జాతి బీజము, అక్షరము, శిరము అని అనుద్రుతమునకు 9 పేర్లు.

2. **ద్రుతము :** అర్ధమాత్ర, ద్రుతము, వ్యోమము, బిందువు, వలయము, అక్షర ద్వయము, వృత్తము అని ద్రుతమునకు 7 పేర్లు.

3. **లఘువు :** లఘువు, సరళము, హ్రస్వము, కళ, వ్యాపకము, మాత్ర అని లఘువునకు 6 పేర్లు.

4. **గురువు :** గురువు, వక్రము, ద్విమాత్ర, కళ, దీర్ఘము, కాణము, యమళము అనునవి గురువునకు 7 పేర్లు.

5. **ప్లుతము :** ప్లుతము, త్ర్యంగము, దీప్తము, నామము, త్రిమాత్రకము, సమోద్భవము అనునవి ప్లుతమునకు 6 పేర్లు.

6. **కాకపాదము :** కాకపాదము, హంసపాదము, నిశ్శబ్దము, చతుర్లఘువు అనునవి కాకపాదమునకు 4 పేర్లు. దీనికి చతుష్కళయని మరొకపేరు కూడ కలదు.

## 5. గ్రహప్రాణ లక్షణము

గ్రహము అనగా ఒక సంగీత రచనలో తాళమును ఉపయోగించి సంగీతమును ప్రారంభించు తావునకు గ్రహ మనిపేరు.

గ్రహము = గ్రహణము. ఇది రెండు విధములు

సమము, విషమము అనునవి.

**1. సమము :** సమము అనగా ఒక కీర్తన లేక పాటలోని పల్లవిని తాళమునందు మొదటిదెబ్బమీద ( తాళము, సంగీతము ) ఒకేసారి సంగీతము ప్రారంభించు తావు. దీనిని సమము లేక సమగ్రహము అని కూడ చెప్పుదురు.

**2. విషమము :** విషమము అనగా కీర్తన లేక పాటయును తాళమును సమముగా నెత్తక ముందుగాని, వెనుకగాని ప్రారంభించుట. ఇది రెండు విధములు :- అతీతము, అనాగతము అనునవి.

**1. అతీతము :** అతీతము అనగా ఏ దయినా ఒక పాటలోని పల్లవి తాళాంత్యమందు గాని లేక తాళము ప్రారంభింపకముందుగాని ( మొదటి దెబ్బకు ముందు ) సంగీతము ప్రారంభించుతావు అతీతము లేక అతీతగ్రహము.

**2. అనాగతము :** అనాగతము అనగా ఏ దయినా ఒక పాటలోని పల్లవి తాళము ప్రారంభించిన తరువాత ( మొదటి దెబ్బ తరువాత ) సంగీతము ప్రారంభించుతావు అనాగతము లేక అనాగతగ్రహము.

## 6. జాతిప్రాణ లక్షణము

లఘ్వంగము జాతి మార్పును పొందును. అప్పుడు లఘువుయొక్క అక్షరముల సంఖ్య వృద్ధి క్షయములను పొందును. జాతి అనగా తాళాంగములలో లఘు సంబంధముగా వాడు పదమునకు జాతి అనిపేరు. ఇవి అంబదు విధములు : 1. చతురశ్రజాతి 2. త్రిశ్ర జాతి 3. మిశ్రజాతి 4. ఖండజాతి 5. సంకీర్ణజాతి అనునవి పంచవిధ లఘువులు. పైన తెలిపినటుల వరుసగా 4, 3, 7, 5, 9 అక్షరకాలములను కలిగియున్నవి. ఈ అయిదు లఘువులుగాక విశేష లఘువులు యింకొక అయిదు లఘువులు చెప్పబడుచున్నవి. 1. దివ్య సంకీర్ణ లఘువు, 2. మిశ్రసంకీర్ణ లఘువు, 3. దేశ్యసంకీర్ణ లఘువు 4. మిశ్ర దేశ్యసంకీర్ణ లఘువు, 5. దేశ్యశుద్ధసంకీర్ణ లఘువు అని చెప్పబడినవి. ఇవి వరుసగా 6, 8, 10, 12, 16 అక్షర కాలముగలవై యుండును. మొత్తము పది లఘువులు. అవి మనుష్య, స్వర్గ, హంస, దేశ్య, చిత్ర, దివ్య, సింహ, వర్ణ, వాద్య, కర్ణాట లఘువులు. ఇవి వరుసగా 4, 3, 7, 5, 9, 6, 8, 10, 12, 16 అక్షరకాలము గలవై యుండును.

## 7. కళా ప్రాణలక్షణము

కళ అనగా తాళముయొక్క అక్షరకాలములోని సమాన్తర్భాగములు.

ఉదాహరణము : చతురశ్రజాతి లఘువులో 4 అక్షరకాలము లున్నవి. ఆ నాలుగు అక్షరకాలములలో అక్షరకాలమొకటికి నాలుగు కళల వంతున నడచిన 4 × 4 = 16 కళలు అగుచున్నవి. ఇవియే కళ లనబడును. ఈ కళలు హ్రస్వాక్షరప్రమాణము ననుసరించియే లెక్కచేయనగును. ఇట్టి కళలు ఒక అక్షరకాలమునకు 1, 2, 3, 4 -ఈ విధముగా నుండును. ఒక అక్షరము ఎన్ని కళలవంతున నడచుచున్న దను విషయమును

గీతమునుబట్టి నిర్ణయించవచ్చును. ఒక్కొక్క తాళాక్షరమునకు ఒక్కొక్క కళ లేక ఒక స్వరముచొప్పున గానము చేసినయెడల అది ఏకకళ అనబడును. అటులనే రెండేసి కళల చొప్పున గానము చేసినయెడల ద్వికళయనియు, నాలుగేసి కళలచొప్పున గానముచేసినయెడల చతుష్కళ యనియు అనబడును. ఏకకళ యనునదే యథాక్షరకళయనికూడా చెప్ప బడుచున్నది. ఒక్కొక్క తాళాక్షరమునకు మూడేసి కళలచొప్పున నడచిన యెడల అది త్రిశ్రగతి యనబడును. అటులనే ఒక్కొక్క తాళాక్షరమునకు 4, 3, 7, 5, 9 కళలు చొప్పున నడచిన యెడల అవి వరుసగా చతురశ్ర, త్రిశ్ర, మిశ్ర, ఖండ, సంకీర్ణగతి యని యనబడును. ఒక్కొక్క తాళాక్షరమునకు ఇన్నేసి కళలచొప్పున నడచుటకు "గతి" యని పేరు. వర్ధమాన కళలనియు, నష్టకళలనియు కళలు రెండు విధములని కూడ కొంతమంది చేత చెప్పబడుచున్నది. ఒక్కొక్క తాళాక్షరమునకు 1, 2, 3, 4 కళలు చొప్పున పెరుగుచూ వచ్చిన యెడల వర్ధమానకళలనియు అదేక్రమములో క్రమముగా 4, 3, 2, 1 కళలచొప్పున తగ్గుచూ వచ్చిన నష్టకళలనియు చెప్పబడుచున్నవి.

## 8. లయ ప్రాణలక్షణము

గానముతో జేరి తాళము హెచ్చు తగ్గు లేక నడచుట "లయ" అని చెప్ప బడును. ఇవి మూడు విధములు. అవి యేవనగా,

1. విలంబ లయ 2. మధ్య లయ 3. ద్రుత లయ అనునవి.

**1. విలంబ లయ :** విలంబ లయ అనగా తాళమున కేర్పడియున్న అక్షర కాలముతో మందగతిగా పాడుట. ( విలంబ = చౌక )

**2. మధ్య లయ :** మధ్య లయ అనగా తాళమున కేర్పడియున్న అక్షర కాలముతో విలంబ లయకు రెట్టింపు వేగము కలిగి సమగతిగా పాడుట. ( మధ్య = సమం )

**3 ద్రుత లయ :** ద్రుత లయ అనగా తాళమున కేర్పడియున్న అక్షర కాలముతో మధ్య లయకు రెట్టింపు వేగము కలిగి త్వరితగతిగ పాడుట. ( ద్రుత = వేగం )

## 9. యతి ప్రాణలక్షణము

లయ యొక్క ప్రవృత్తి నియమమునకు "యతి" అని పేరు.

1. సమయతి
2. స్రోతోవహాయతి
3. గోపుచ్ఛయతి
4. డమరుకయతి
5. మృదంగయతి
6. విషమయతి

అని యతులు ఆరు విధములు.

**1. సమ యతి :** సమ యతి అనగా ఒక తాళావృత్తమునకుగల అంగములు ఒకే రీతిగా నుండుట. ఇది పిపీలికా యతి అని కూడ అనబడుచున్నది.

ఉదాహరణము : U U U U U

**2. స్రోతోవహ యతి :** స్రోతోవహ యతి అనగా ఒక తాళావృత్తములోని అంగములు మొదట తక్కువగ నుండి క్రమముగా హెచ్చగుట. నదీప్రవాహ మిట్లే యుండును గనుక దీనికి స్రోతోవహ యను పేరు గల్గినది.

ఉదాహరణము : U O I S Ṡ

3 **గోపుచ్ఛ యతి :** గోపుచ్ఛ యతి అనగా ఒక తాళావృత్తమునగల అంగములు మొదట హెచ్చుగా నుండి క్రమముగా తగ్గును. ఆవుతోక మొదట వెడల్పుగా నుండి క్రమముగా సన్నగా నుండును. ఆ పోలికచే ఈ యతికి గోపుచ్ఛ యతి అని పేరు కలిగినది.

ఉదాహరణము : Ṡ S S I O U

**4. డమరు యతి :** డమరు యతి అనగా లఘు, ద్రుతములు మధ్యగా నుండి ఆద్యంతములందు గురు, ప్లుతములు గల్గియుండుట. ఆద్యంతములు అధికములై మధ్యభాగము స్వల్పమగుటచే ఈ యతికి డయరు యతి అని పేరు వచ్చినది.

ఉదాహరణము : I O U O I

**5. మృదంగ యతి :** మృదంగ యతి అనగా మృదంగము వలె ఒక తాళావృత్తములోని అంగములు మధ్యభాగము హెచ్చుగను ఇరు ప్రక్కల కురుచగా నుండుట.

ఉదాహరణము : O I S I O

**6. విషమ యతి ;** విషమ యతి అనగా ఆదియందు గురు, ప్లుతములును, అంతమందు లఘు, ద్రుతములును గలది. ఇంతకు పైన చెప్పిన అయిదు యతులలోను చేరక, అంగములు ఒక వరుసలో నుండక ఎగుడు దిగుడుగా నుండుటచే నిది విషమ యతి అనబడినది.

ఉదాహరణము : S Ṡ I O

ఈ ఆరింటిని సామాన్య యతు లని చెప్పవచ్చును. ఇవి ఒకదానితో మరియొకటి కలియుట మూలముగా మిశ్రయతు లనియు, ఒక్కొక్కదానితో రెండేసి కలియుటవలన సంకీర్ణయతులు ఉద్భవించుననియు చెప్పవచ్చును.

## 10. ప్రస్తార ప్రాణలక్షణము

ద్రుతాది అంగప్రస్తారములు అనేకవిధములుగా నున్నవి. ఈ ప్రస్తారము లన్నియు తాళభేదములను నిరూపించుటకొరకు ఏర్పడినవి. కాకపాదమందు క్రమముగా నొక్కొక్క అనుద్రుతమును తగ్గించుచూ వచ్చిన షోడశాంగములు ఏర్పడును. అందు ఒక్కొక్క అంగమును ప్రస్తరించిన అనేక తాళములు ఏర్పడును. షోడశాంగముల నామములు, వాని రూపములు దిగువ నుదహరింపబడినవి :

| | | | | |
|---|---|---|---|---|
| 1. | + | కాకపాదము | 16 | |
| 2. | | ప్లుత ద్రుతవిరామము | 15 | |
| 3. | | ప్లుతద్రుతము | 14 | |
| 4. | | ప్లుత విరామము | 13 | |
| 5. | | ప్లుతము | 12 | దీనిని వాద్య లఘు వందురు |
| 6. | | గురుద్రుత విరామము | 11 | |
| 7. | | గురుద్రుతము | 10 | దీనిని వర్ణలఘు వందురు |
| 8. | | గురు విరామము | 9 | దీనిని చిత్రలఘు వందురు |
| 9. | ౭ | గురువు | 8 | దీనిని సింహలఘు వందురు |
| 10. | | లఘుద్రుత విరామము | 7 | దీనిని హంసలఘు వందురు |
| 11. | | లఘుద్రుతము | 6 | దీనిని దివ్యలఘు వందురు |
| 12. | | లఘు విరామము | 5 | దీనిని మార్గలఘు వందురు |
| | | | 4 | దీనిని మనుష్య లఘు వనియు, ఖండ లఘు వనియు అందురు |
| 13. | । | లఘువు | 3 | దీనిని స్వర్గలఘు వందురు |
| 14. | | ద్రుత విరామము | 2 | |
| 15. | ○ | ద్రుతము | 1 | |
| 16. | ∪ | విరామము | | |

**గతిభేదము** : తాళమునకు ఆధారమై, లీనమై నిర్ణీత సమయములందు కలుగు ధ్వని విశేషము "గతి" యనబడును. ఈ గతులుగూడ జాతులకువలె చతురశ్రాది పంచభేదము లుండి అక్షరకాలమునకు 4, 3, 7, 5, 9 కళలు నడచుచుండుటచే గతి

భేదము కలుగుచున్నది. ఒక్కొక్క తాళాక్షరమునకు ఇన్నేసి స్వరముల చొప్పున గాన క్రమములో నిర్దిష్టముగా స్వరములు నడచెడి విధానము గతి యనబడుచున్నది. త్రిశ్ర, చతురశ్ర, ఖండ, మిశ్ర, సంకీర్ణ అని అయిదు గతులు గలవు. ఇవి పంచగతు లనబడు చున్నవి. ఒక్క తాళాక్షరమునకు మూడేసి స్వరముల చొప్పున నడచిన త్రిశ్రగతి యనియు, నాలుగు స్వరముల చొప్పున నడచిన చతురశ్రగతి యనియు, అయిదేసి స్వరముల చొప్పున నడచిన ఖండగతి యనియు, ఏడేసి స్వరముల చొప్పున నడచిన మిశ్రగతి యనియు, తొమ్మిదేసి స్వరముల చొప్పున నడచిన సంకీర్ణగతి యనియు అనబడుచున్నవి. కనుక 35 తాళము లందు గానము, త్రిశ్ర, చతురశ్ర, ఖండ, మిశ్ర, సంకీర్ణ అనబడు అయిదు గతులలో నడచు చున్నందువలన ఒక్కొక్క తాళము అయిదేసి గతి భేదముల చొప్పున $35 \times 5 = 175$ తాళము లైనవి.

## 35 తాళములను జూపెడి పథకము

| సంఖ్య | పేర్లు | స్వరూపము | చ. అక్షర సంఖ్య | చతురశ్ర పేర్లు | త్రి. అక్షర సంఖ్య | త్రిశ్ర పేర్లు | మి. అక్షర సంఖ్య | మిశ్ర పేర్లు | ఖం. అక్షర సంఖ్య | ఖండ పేర్లు | సం. అక్షర సంఖ్య | సంకీర్ణ పేర్లు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | ధ్రువ | I O I I | 14 | శ్రీకర | 11 | మణి | 23 | పూర్ణ | 17 | ప్రమాణ | 29 | భువన |
| 2 | మఠ్య | I O I | 10 | సమ | 8 | సార | 16 | ఉదీర్ణ | 12 | ఉదయ | 20 | రావ |
| 3 | రూపక | O I | 6 | పత్తి | 5 | చక్ర | 9 | కుల | 7 | రాజ | 11 | బందు |
| 4 | ఝంప | I ∪ O | 7 | మధుర | 6 | కదంబ | 10 | సుర | 8 | చణ | 12 | కర |
| 5 | త్రిపుట | I O O | 8 | ఆది | 7 | శంఖ | 11 | లీల | 9 | దుష్కర | 13 | భోగ |
| 6 | అట | I I O O | 12 | లేఖ | 10 | గుప్త | 18 | లోయ | 14 | విదళ | 22 | ధీర |
| 7 | ఏక | I | 4 | మాన | 3 | సుధ | 7 | రాగ | 5 | రత | 9 | వసు |

### తాళవిభజన

లఘువు యొక్క జాతి భేదము వలన ఏర్పడిన సూళాది 35 తాళములలో ప్రస్తారక్రమము నందు చతురశ్రజాతితో ఏర్పడిన 7 తాళములు శుద్ధతాళము లనియు, జాతి భేదముల వలన ఏర్పడిన 28 తాళములను అష్టవింశతి వికృతతాళము లనియు చెప్పుదురు.

## గానమందు జూపునట్లు వాద్యమందు జూపదగు పంచదశ గమకములు

1. తిరిపము
2. కంపితము
3. స్ఫురితము
4. లీనము
5. ఆన్దోళితము
6. వలి
7. త్రిభిన్నము
8. కురుళము
9. ఆహాతము
10. ఉల్లసితము
11. ప్లావితము
12. గుంఫితము
13. ముద్రితము
14. నామితము
15. మిశ్రితము

శబ్దము యొక్క కదలిక భేదములు గమకము లనబడును. అట్టి కర్ణానందమగు గమకములు 15 విధములు.

## గమకములు ఉపయోగించు విధము

1. **తిరిపము :** తిరిపము అనగా శబ్దము నొక్కుట, అదుముట

ఉదాహరణము :- తా క్కిట, ధీ క్కిట, తోం గ్గిట, నాం గ్గిట

2. **కంపితము :** కంపితము అనగా ఒక శబ్దము ఒక్కస్థానమున నిల్పి కదలించుట

ఉదాహరణము : నా దీం, నా దీం, నత దీం, దీం, ధీం

3. **స్ఫురితము :** స్ఫురితము అనగా స్ఫుటమయిన శబ్దమును వేగముగ పలికించుట

ఉదాహరణము : దిరుగుడు, దిరుగుడు, కుకునన, కుకునన

4. **లీనము :** లీనము అనగా ఒక శబ్దమం దొక శబ్దమును లయింప జేయుట

ఉదాహరణము : త ఝం, త ఝం, త ఝం, త ఝం, త ఝం

5. **ఆన్దోళితము :** ఆన్దోళితము అనగా ఉయ్యాలలో పిల్ల నూపినటుల శబ్దము నూపుట

ఉదాహరణము : ధీం ధీం ధీం నాం తాద్ధీం ధీం నాం

6. **వలి :** వలి అనగా ముందు ఒక శబ్దము ఇచ్చి వెనుక తుమ్మెదమోత శబ్దము ఇచ్చుట.

ఉదాహరణము : ధీం తాం దిరుగుడు దిరుగుడు, ఝం తాం దిరుగుడు దిరుగుడు

7. **త్రిభిన్నము :** త్రిభిన్నము అనగా మూడు విధములైన శబ్దము లొక్కసారి చూపుట.

ఉదాహరణము : నద్ధీం కిట తక తద్ధీం కిట తక నద్ధీం తద్ధీం తక తరి కిట తక

**8. కురుళము :** కురుళము అనగా ఒక శబ్ద స్థానములో నిల్చి దానికి చేరిన వేరొక శబ్దమును బిగిగా పలికించుట.

ఉదాహరణము : కిట తరి కిట తరి కిట కిట కిట తరి

**9. ఆహతము :** ఆహతము అనగా ఒక శబ్దమును గొట్టి వేరొక శబ్దమునకు దిగునపుడు మొదటి శబ్దమును సన్నగా జార లాగుట. దీనినే రవజాతి యందురు.

ఉదాహరణము : దిరు గుడు తాం దిరు గుడు నాం దిరు గుడు తాం దిరు గుడు నాం

**10. ఉల్లసితము :** ఉల్లసితము అనగా, నీటిపై చిల్లపెంకు విసరిన నీటి రూప మెట్లుండునో అటులనే ఒక శబ్దమును పైనుండి క్రిందికి, క్రిందినుండి పైకి పలికించుట. దీనికే జారు అని పేరు. ఉత్తుంగ మనియు వాడుక కలదు.

ఉదాహరణము : తొం తరి తత్తోం, తరి తత్తోం, తరి తత్తోం, తరి తరి తరి తరి

## తాళ విభజన

మార్గతాళము లనియు, దేశ్యతాళము లనియు తాళములు మొదట రెండు విధములు. తదుపరి యీ రెండు విధములగు తాళములు శుద్ధ తాళములు, సాలగ తాళములు, సంకీర్ణ తాళములు అని మూడు భేదములని ప్రాచీన గ్రంథములందు చెప్పబడినది.

## మార్గతాళములు

| | | |
|---|---|---|
| 1. | చచ్చుత్పుట | ઽ ઽ । ઽ̍ |
| 2. | చాచత్పుట | ઽ । । ઽ |
| 3. | షట్పితాపుత్రిక | ઽ̍ । ઽ ઽ । ઽ̍ |
| 4. | సంపద్వేష్టిక | ઽ̍ ઽ ઽ ઽ ઽ̍ |
| 5. | ఉద్ఘట్టము | ઽ ઽ ઽ |

అను అయిదు తాళములు మార్గతాళములని చెప్పబడినవి.

**శుద్ధతాళములు :** శుద్ధతాళము అనగా మరియొక తాళముతో మిశ్రమము కానివి.

| | | | |
|---|---|---|---|
| 1. | చచ్చుత్పుట | ઽ ઽ । ઽ̍ | ఇది మార్గశుద్ధము |
| 2. | ధ్రువతాళము | । O । । | ఇది దేశ్యశుద్ధము |

### సాలగతాళములు

సాలగతాళములు అనగా రెండేసి తాళములు కలసిన తాళములు,

1. కీర్తితాళము : | ఽ ఽ̍ ఽ | ఽ̍ - ఇది త్రిభిన్న, కోకిలప్రియతాళముల మిశ్రమము - ఇది మార్గసాలగము

2. ధ్రువరూపకము : | O | | O | - ఇది ధ్రువతాళము, రూపకతాళముల మిశ్రమము - ఇది దేశ్యసాలగము.

### సంకీర్ణతాళములు

రెండేసికన్న ఎక్కువ తాళములు సంమిశ్రమముతో నేర్పడిన తాళములు సంకీర్ణతాళము లనబడును.

1. **సింహానందన తాళము** : ఽ ఽ | ఽ̍ | ఽ O O ఽ ఽ | ఽ̍ | ఽ̍ ఽ | | +. ఇది చచ్చుత్పుట, రతీతాళము, దర్పణతాళము, కోకిలప్రియ, అభంగ, ముద్రిక అను ఆరు తాళముల సంమిశ్రమము. ఇది మార్గ సంకీర్ణము.

చచ్చుత్పుటాది పంచప్రాచీనమార్గతాళములలో అనుద్రుతము, ద్రుతము, కాకపాదము ఉపయోగింపబడలేదు.

### దేశ్యతాళములు

ఆ యా కాలములందు ఆ యా ప్రాంతముల యందు ఉపయోగింపబడుచు విశేషముగా ప్రచారమునందున్న తాళములు దేశ్యతాళములు. దక్షిణ భారతీయ గానమందు ప్రస్తుతము ప్రచారమునందున్న తాళములు ముఖ్యముగ ఏడు గలవు. అవి ధ్రువ, మఠ్య, రూపక, ఝంప, త్రిపుట, అట, ఏకతాళము లనెడి నామములతో సప్తతాళములని వ్యవహరింపబడుచున్నవి.

క్రీస్తు తరువాత 16-వ శతాబ్దమునందు సంగీతపితామహుడైన శ్రీ పురందరదాసులవారు అలంకారములను, గీతములను, సూళాదులను, కీర్తనలను ఈ తాళములలో రచించుట మూలముగా సప్తతాళములను మొట్టమొదట దక్షిణ భారతీయ గానమందు ప్రవేశపెట్టిరి. తదుపరి భద్రాచల రామదాసు, క్షేత్రయ్య, త్యాగరాజస్వామి మున్నగువారు క్రమముగ నీ తాళములలో విశేషముగ ప్రబంధములను రచించినందువలన దక్షిణ భారతీయ గానమందు ప్రాచీనతాళములు ఉపయోగమునుండి తొలగి సప్తతాళములు విశేషముగా ప్రచారములోనికి వచ్చినటుల చెప్పవచ్చును. సప్తతాళములను పరిశీలించి చూచినపుడు ఈ క్రింది ఏడు అంశములు ముఖ్యముగ గోచరించుచున్నవి. అందువలన ఈ ఏడు అంశములను సప్తతాళముల లక్షణమని చెప్పవచ్చును.

1. సప్తతాళములు లఘువు, ద్రుతము, అనుద్రుతము అను మూడు అంగములతో మాత్రమే ఏర్పడినవి.

2. లఘువు మరియొక అంగముతో చేరని సందర్భమందు అది ఏకాంగతాళముగ మాత్రమే చెప్పబడినది.

3. అంగములు భేదించినందువలనను, ఆ యా అంగముల సంఖ్యలు భేదించినందు వలనను, లఘువు యొక్క జాతిభేదముల వలనను మాత్రమే సప్తతాళములు ఒకదానితో మరియొకటి భేదించుచున్నవి.

4. లఘువులేని తాళము లేదు.

5. ఒక తాళము యొక్క మొత్తపు అంగముల సంఖ్య నాలుగుకన్న మించలేదు.

6. తాళాదిని గాని, తాళాంతమున గాని అనుద్రుత మేర్పడలేదు.

7. ఒక తాళము మూడుకన్న ఎక్కువ లఘువులను, రెండుకన్న ఎక్కువగ ద్రుతములను, ఒకటికన్న ఎక్కువగ అనుద్రుతములను కలిగియుంటలేదు. మరియు ఒకటి కన్న ఎక్కువ లఘువులుగల తాళములలో యా లఘువు లన్నియు ఒకే జాతికి చెంది యున్నవి.

లఘుభేదముల వలన ఏర్పడిన 35 తాళములు సూళాదితాళములని అనబడు చుండుటకు పురందరదాసులవారు సూళాదు లనెడి యొకానొక రకపు ప్రబంధములను ఆ తాళములలో రచించుటయే కారణము.

## చాపు తాళములు

వీటికి అంగములు రెండేసి ఘాతలు లేక ఒక ఘాత, ఒక ఉసి యని చెప్పవచ్చును. ఇవి నాలుగు రకములుగ వాడబడుచున్నవి.

1 **మిశ్రచాపు**: మూడక్షరముల కాలము కలిగిన ఒక ఉసి లేక ఘాత, మరియు నాలుగక్షరముల కాలము కలిగిన మరియొక ఘాత దీనికి అంగములు. దీని మొత్తము అక్షర కాలము ఏడక్షరములు. (''నిధి చాల సుఖమా'')

2. **ఖండచాపు**: రెండక్షరముల కాలము కలిగిన ఒక ఘాతయు మరియు మూడ క్షరముల కాలము కలిగిన మరియొక ఘాతయు దీనికి అంగములు. దీని మొత్తము అక్షర కాలము అయిదు అక్షరములు. (''పరిదాన మిచ్చితే'')

3. **త్రిశ్రచాపు**: ఒక అక్షర కాలముగల ఒక ఘాతయును, మరియు రెండక్షరముల కాలముగల మరియొక ఘాతయు దీనికి అంగములు. దీని మొత్తము అక్షరకాలము మూ డక్షరములు. (''రామచంద్ర నన్ను'')

4. **సంకీర్ణచాపు**: నాల్గక్షరముల కాలముగల ఒక ఘాత, అయిదు అక్షరముల కాలముగల మరియొక ఘాత దీనికి అంగములు. దీని మొత్తపు అక్షరకాలము తొమ్మిది అక్షరములు.

మిశ్రచాపు, ఖండచాపు, త్రిశ్రచాపు తాళములు గ్రామ్య గానమందు విశేషముగ వాడబడుచున్నవి. సంకీర్ణచాపుతాళము పై తాళముల వలె విశేషముగ ప్రచారములోలేదు.

## దేశాది, మధ్యాది తాళముల వివరము

1. **దేశాదితాళము:** దేశాదితాళ మనగా ఉసి, మూడు ఘాతలు గలది. సాధారణముగా నెమ్మదిగా నుండును. ఉసిలో (3/4) ముప్పాతిక మాత్రకాలము వ్యవధి అయిన తరువాత గీతము ప్రారంభ మగును. ("భువిని దాసుడని")

2. **మధ్యాదితాళము:** మధ్యాదితాళ మనగా ఒక ఉసి, మూడు ఘాతలు గలది. ఈ తాళము నడచు వేగము దేశాదితాళమువలె అంత నెమ్మదిగా నుండదు. అనగా, కొంచెము వేగముగా నుండును. ఉసిలో (1/2) అర్ధ మాత్ర కాలము. వ్యవధి అయిన తరువాత గీతము ప్రారంభ మగును. ("మేరు సమాన")

### లయ అనగా నేమి?

రెండు హస్తముల సంయోగ వియోగములు తాళమందు క్రియలు. రెండు క్రియలకు మధ్యనుండు కాలమునకు మాన మని పేరు. దీనినే "లయ" అందురు. లోకమందు లయ లేకపోవుట యుండదు. కాల, నాదములకు అవినాభావ సంబంధము గలదు. చైతన్య మెచ్చట నుండునో అచ్చట లయ యున్నట్లు గ్రహింప నగును. లయ లేనిచో గమనమే యుండదు. మనము నడచునప్పుడు ఒక అడుగు ముందునకు ఎంతకాలములో వేయుదుమో రెండవ అడుగును గూడ అంతకాలములో ముందునకు వేసినప్పుడే నడక సరిగా సాగుచున్నది. లేనిచో వ్యత్యస్తమై నడక సాగదు. లయ ప్రకారము నడచునప్పుడు అట్టి లయజ్ఞానము ఉండకపోవచ్చును. లయజ్ఞానము కలుగుటయే తాళజ్ఞానము కలుగుట. అభ్యాసమువలన లయజ్ఞానము సిద్ధించును.

### తాళముయొక్క ప్రయోజనమేమి?

గజమును అంకుశముచేత లోబరచుకొని అదుపు ఆజ్ఞలలో నుంచని పక్షమందు అది స్వేచ్ఛగా సంచరించును. అందువలన ప్రమాదములు కలుగును. అటులనే తౌర్యత్రిక మను గీత, వాద్య, నృత్యములను తాళముచేత స్వాధీనముచేసికొనని యెడల సంగీతమునకు ప్రమాదములు కలుగును. తాళములేనిచో లోకమే లేదనవలెను. తాళజ్ఞానమును సంపాదించుట ప్రథమ కర్తవ్యము.

## ప్రస్తారముల పేర్లు

1. నష్టము
2. ఉద్దిష్టము
3. పాతాళము
4. మహాపాతాళము
5. అనుద్రుత మేరువు
6. ద్రుత మేరువు

| | | | |
|---|---|---|---|
| 7. | ద్రుతశేఖర మేరువు | 11. | కాకపాద మేరువు |
| 8. | లఘు మేరువు | 12. | సంయోగ మేరువు |
| 9. | గురు మేరువు | 13. | ఖండప్రస్తారము |
| 10. | ప్లుత మేరువు | 14. | యతిప్రస్తారము |

అని పదునాలుగు ప్రస్తారములు గలవు.

## మృదంగవాద్యవివరము

మృదంగము యొక్క ప్రాముఖ్యత : హిందూదేశములో శాస్త్రసమ్మతమయిన చర్మ వాద్యము లన్నిటిలో మృదంగము చాలా ప్రాముఖ్యమయినదియును, మిక్కిలి పురాతన మయినదియు నై యున్నది. ముఖ్యముగా నీ వాద్యమును దక్షిణ భారతదేశములో జరుగు గాత్ర వాద్య సంగీత కచ్చేరీ లన్నిటిలోను ఉపయోగింతురు. మరియు హరికథా గానము లందును, భరతనాట్య ప్రదర్శనము లందును, వీధినాటకము లందును, ఆర్కెస్ట్రాల యందు గూడ దీనిని ఉపయోగించుదురు. మృదంగములో నైపుణ్యము సంపాదించుట మిక్కిలి కష్టసాధ్య మయిన విషయము. నిపుణులగు మార్దంగికులు పాటకచేరీలలో తని (సోలో) గా వాయించునపుడు తాళమున కనువగున ట్లుపయోగించు జతులు, ముక్తాయిలు వినుట కెంతో సొంపుగా నుండి వారికి గల పాండితీప్రతిభను చాటుచుండును.

## మృదంగశబ్దోత్పత్తి

మృదంగము అను పదమునకు 'మట్టితో చేయబడిన అవయవ' మని అర్థము. బహుశః నీ వాద్యమున కాధారమయిన గుల్ల (కర్రడొల్ల) ను మొదట మట్టితో చేసి యుండ వచ్చును. మట్టితో చేయబడిన గుల్ల గలదియై ఉపాంగ మగుటచే మృత్ + అంగము = మృదంగము అని పేరు వచ్చి యుండవచ్చును. కాలక్రమమున నీ గుల్లను మట్టితో చేయుట మాని కర్రతో చేయు పద్ధతి ఏర్పడి యుండవచ్చునని ఊహించుటకు వీలగుచున్నది. దీనిని మృదంగము, మర్దలము, మురజము అందురు.

## మృదంగము యొక్క పూర్వచరిత్ర

సర్వజనోపయోగకరమయిన యీ వాద్యమును మొదట దేవతాపురుషుడు సృష్టించె ననుటలో సందేహ మేమియు లేదు. త్రిపురాసుర సంహార మయిన పిదప మహా దేవుడు జయసూచకముగా నొనర్చిన నాట్యములో హంగుచేయుటకొరకు బ్రహ్మ దీనిని సృష్టించె ననియు, మొదట నీ వాద్యమును గణేశుడు వాయించె ననియు చెప్పుదురు.

## తాళ మనగా నేమి?

'త' కారము శివస్వరూపమై ఉండును. 'ల' కారము శక్తిస్వరూపమై ఉండును. శివ శక్తి సమాయోగము వల్ల తాళమని చెప్పబడెను. లేక తాండవ లాస్యములను రెండు

పదముల ప్రథమాక్షరముల సంయోగము వలన "తాల" మని మొదట సంస్కృతమందు ఉత్పత్తియై ఆ తాల మను శబ్దమే క్రమముగా తెలుగులోనికి "తాళ" మని పరిణామ మొందినది.

### జాతులు

1. చతురశ్ర — బ్రాహ్మణ
2. త్రిశ్ర — క్షత్రియ
3. ఖండ — వైశ్య
4. మిశ్ర — శూద్ర
5. సంకీర్ణ — సంకీర్ణజాతులు

### కురుఘంపతాళము

దీనికి ఒక ద్రుతము, ఒక ఖండ లఘువు

2 5 3

o ı ı, 2 + 5 + 3 = 10 అక్షరముల కాలము.

## అనులోమ విలోమ వివరము

లోగడ చెప్పిన దశప్రాణయుక్తమగు తాళమును వేయుచు గాత్రమునగాని జంత్రమున గాని గానముచేయుట రెండు విధములుగా నుండును.

1. **అనులోమము:** అనులోమ మనగా తాళమును ప్రథమకాలముగా నడుపుచు స్వరములనుగాని, జతులనుగాని నోటితోగాని, జంత్రమందుగాని ఒకటి, రెండు, మూడు త్రికాలములు నడుపుట.

2. **విలోమము:** విలోమ మనగా స్వరములు గాని, జతులు గాని నోటితోగాని, జంత్రమందు గాని ప్రథమకాలముగా నడుపుచు, తాళము యొక్క అక్షర కాలమును ఒకటి, రెండు, మూడు త్రికాలముగా నడుపునవి.

### మృదంగమునభ్యసించు విధము

మృదంగము నేర్చుకొనువారు మొదట నోటితో చినపాల వరుసలు నేర్చుకొని తరువాత మృదంగము మీద త్రికాలములు అభ్యసించవలెను. తరువాత పెదపాల వరుసలు, జతులు మొదలగునవి సాధన చేసిన తరువాత ఆది, రూపకము, మిశ్రచాపు, త్రిశ్రరూపకము, త్రిశ్రత్రిపుట వంటి తాళములు కృషిచేసి మృదంగము మీద అభ్యాసము చేయవలెను. ఈవిధంగా దీర్ఘకాలము కృషిచేసినగాని ఈ వాద్యములో తగిన ప్రావీణ్యత సంపాదించుట సాధ్యముకాదు.

## మృదంగం కచేరీలయందు వాయించు విధము

సుప్రసిద్ధ గాయకుడు తన పాండిత్యమును రాగ, తాన, పల్లవి, నెరవల్, కల్పన స్వరములను ప్రదర్శించుటలో చూపగలిగినట్లు సుప్రసిద్ధ మార్దంగికుడు తన పాండిత్యమును పాట ననుసరించి వాయించుటలోనే గాక ఆ యా తాళముల కనుగుణమైన జతులు, ముక్తాయిలు, మోరాలు తనిగా ప్రదర్శించుటలోగూడ చూప కలుగును. కనుక సంగీత కచేరీలలో మార్దంగికునకు కనీసము రెండు పర్యాయములైన తనిగా వాయించుటకు అవకాశము ఇచ్చెదరు. ఇట్లు చేయుటవలన కచేరి రక్తికట్టుటకు ఎంతయు దోహద మగును.

మృదంగం శ్రుతిశుద్ధమైన నాటు మీటులతో పాటకుని లయను నడుపుతూ వుంటుంది.

మృదంగం మన కర్ణాటక సంగీతములో కేవల లయను నడపడమే కాకుండా పాటకుని పాటతోపాటు లయ విన్యాసం కూడా యిస్తూ వుంటుంది. రెండూ కలసి శ్రోతలకు వర్ణచిత్రంలోవలె సమిష్టి అనుభవాన్ని కలుగజేస్తాయి.

### కురు ఝంపతాళము

దీనికి ఒక ద్రుతము, ఒక ఖండ లఘువు, ఒక త్రిశ్ర లఘువు అంగములు.

$\overset{2}{0}\ \overset{5}{1}\ \overset{3}{1} = 2+5+3 = 10$ అక్షరముల కాలము.

### ఝంపట తాళము

పదునేడవశతాబ్ది మధ్యలో వేంకటమఖి రచించిన "చతుర్దండిప్రకాశిక" అను గ్రంథములోని స్వరప్రకరణమందు ప్రస్తుతపు ఆదితాళమే ముందుగ రెండు ద్రుతములు, తదుపరి చతురశ్రలఘువుతో ఝంపటతాళమని చెప్పబడినది.

### సమగ్రహమునకు ముక్తాయించు విధము

తాళావర్తమందుగల హస్తక్రియల సంఖ్యను మార్గాక్షరముల సంఖ్యచే గుణింపగా నేర్పడిన మొత్తము అక్షరములలో ముక్తాయి అక్షరములను మినహాయించిన ఎన్ని అక్షరములు మిగులునో తాళప్రారంభమునుండి అన్ని అక్షరముల తాళము గడచిన అనంతరము ముక్తాయిని ప్రారంభించి అనుష్ఠించిన గీతప్రారంభ (సమగ్రహ) స్థానమునకు సరిపోవును.

### శుద్ధమద్దలము

దీనికి కరిణ వుండదు. అంతా మృదంగమును పోలియుండును. కథాకళి నృత్య ప్రదర్శనలో నిలబడి దీనిని వాయించెదరు.

## చండ

ఇది మృదంగముకన్న బాగా లావుగా ఉండును. నిలువుగా వుంచి, ఒకవైపునే పుల్లలతో వాయించెదరు. శబ్దము తాషామరపువాద్యశబ్దమును పోలియుండును. ఈ వాద్యముకూడా కథాకళి నృత్యప్రదర్శనలో నిలబడి వాయించెదరు.

## మృదంగము తయారుచేయు క్రమము

మృదంగము పనసకర్ర, యేగీసికర్ర, గంగరావి, శిసువుకర్ర మొదలగు కర్రలతో చేయుదురు. పైన వ్రాసిన కర్రలలో పనసకర్ర శ్రేష్ఠము. ఆంధ్రప్రాంతమునకన్న తంజావూరు జిల్లాలో మంచి పనసకర్ర దొరుకును.

## మృదంగము కొలతలు

షుమారు 1944-వ సంవత్సరము వరకు 18 అంగుళములనుంచి 20 అంగుళముల వరకు పొడవుగల మృదంగాలను ఉపయోగిస్తూ వచ్చారు. ఇప్పుడు 22 అంగుళముల నుంచి 26 అంగుళముల వరకు పొడవుగల మృదంగాలు ఉపయోగిస్తున్నారు. పొడవు పెంచినందువల్ల తక్కువ శ్రుతులకు అనగా ఒకటిన్నర, ఒకటి, అంతకన్న తక్కువ శ్రుతులకు బాగుగా ఉండును. పొడవు పెంచిన మృదంగములకు తక్కువ శ్రుతులకు కుడివైపు కన్ను 6¾ అంగుళముల నుంచి 7 అంగుళముల వరకు వెడల్పు ఉంచుతున్నారు. హెచ్చు శ్రుతులకు అనగా రెండున్నర శ్రుతి నుంచి అయిదున్నర శ్రుతి వరకు 6¼ అంగుళముల నుంచి 6½ అంగుళముల వరకు వెడల్పు ఉంచుతున్నారు. ఎడమవైవు కన్ను 7½ అంగుళముల నుంచి ఎనిమిది అంగుళముల వరకు వెడల్పు ఉంచుతున్నారు. మృదంగము యొక్క మధ్య ఉండు పొట్ట చుట్టుకొలత 34 అంగుళములు మొదలు 38 అంగుళముల వరకు ఉంచుదురు. ఆ ఉంచే పొట్ట మృదంగమునకు మధ్యగాకుండా కొంచెము ఎడమవైపుకు ఉంచుదురు. పైన వ్రాసిన కొలతల ప్రకారము వడ్రంగివద్ద మృదంగం తయారుచేయించి లోపలిభాగము తొలిపించవలెను. మందము అర అంగుళము వరకు ఉండవలెను. అట్లు తయారుచేయించిన (గుల్ల) కర్రకు మూతలు కుట్టించవలెను.

## కుడిమూత కుట్టే క్రమము

పాటచర్మము ఆడమేకది కావలయును. రెప్పచర్మము పూర్వము మేకదే వేసెడివారు. గాని షుమారు పది పదిహేను సంవత్సరముల నుండి ఆవుదూడ చర్మము వేస్తూ యున్నారు. అందుచే రెప్పకు ఆవుదూడ చర్మము కావలయును. పాటచర్మమునకు ఒత్తిడి తగలకుండ వుండుటకు పాటచర్మము అడుగున కోణం మీాద మేకచర్మము వేయవలయును. దీనిని 'ఒత్తుడు చర్మము' అందురు. పై మూడు చర్మములు తెచ్చి నీళ్లలో నానవేసి నానిన చర్మాలను బాగుచేసి వుంచవలయును. ఈ చర్మములతోబాటు మూత కుట్టుటకు గొడ్డుచర్మములో నుంచి కుట్టుటకు, కొసలు చుట్టూ ఏర్పరచుటకు బొద్దుకు కావలసిన

కొసలు కోసుకొని బొద్దు తయారుచేసి బాగుచేసిన చర్మాలు మూడూ మృదంగం యొక్క కుడివైపున అమర్చి కదలకుండా చర్మాలకు నాలుగు వైపులా నాలుగు బెజ్జాలు వేసి చర్మాలను కట్టవలయును. చర్మముల చివర చుట్టూ 16 బెజ్జములు వేసి సన్నని వారుతో బిగించవలయును. దీనినే 'పెడవారు బిగించుట' అని అందురు. తరువాత కుట్టుటకు కోణము నకు ఆనుకొని 48 సన్నని బెజ్జములు కొట్టవలయును. ఆ కొట్టిన బెజ్జముల నానుకొని బొద్దు అమర్చి నాలుగు కొసలతో మూత కుట్టవలయును. పూర్వము మూడు కొసలతోనే కుట్టెడివారు. ఇప్పుడు నాలుగు కొసలతో కుట్టినందువలన మూత శ్రుతి బాగా నిలబడి వుండుటకు వీలుంటుంది. మూత కుట్టిన తరువాత షుమారు నాలు గయిదు గంటలు ఎండలో ఆరబెట్ట వలయును. ఆరిన మూతకు కుట్లు మధ్య నుంచి 16 కళ్లు వేయ వలయును. కన్నుకు కన్నుకు మధ్య మూడు కుట్లు వదలివేయ వలయును. ఆ 16 కళ్లలో నుంచి వారు ఎక్కించి బిగించవలయును. దీనినే 'మిద్దెవిరచుట' అంటారు. ఆ బిగించే వారు గేదె చర్మములోనుంచి కోస్తారు. మూత కుట్టేటప్పుడు బిగించిన పెడవారు అలాగునే వుంచి మిద్ది విరచుటకు ఎడమ వైపున పాతమూత పెట్టి బిగిస్తారు. మిద్ది విరచిన తరువాత బాగా ఆరబెట్ట వలయును. మూత ఆరిన తరువాత బిగించిన వారులు వూడదీసి కైవారంతో కొలతప్రకారం రెప్ప కోసుకో వలయును. మూతకు చుట్టూ ఎక్కువ వున్న చర్మాన్ని కోసివేయ వలయును. దీనినే 'మేలుమూత చేయుట' అంటారు. తరువాత ఎడమ మూత కూడా కుట్టి కుడి మూతకు కరిణ వేస్తారు.

## ఎడమ మూత కుట్టే క్రమము

ఎడమ మూత కూడ పై మూత మాదిరిగానే ముందు బొద్దు కొసలు, కుట్టు కొసలు తయారుచేసుకోవలయును. ఈ మూతకు గొడ్డు చర్మాలు కావలయును. మూతకు సరిపోయేవి రెండు చర్మాలు తీసుకొని చర్మాల మధ్య బెజ్జం కోసి మూతకు అమర్చి పై మూత లాగునే పెడవారు బిగించి కోణం చుట్టూ 32 బెజ్జములు కొట్టవలయును. తరువాత బొద్దు అమర్చి కుట్టవలయును. పెడవారు బిగించుట, మూత కుట్టుట, ఆరబెట్టుట, 16 కళ్లు వేయుట, మిద్ది విరచుట, మేలుమూతచేయుట పై కుడి మూత మాదిరిగానే చేయవలయును. మేలు మూత చేసేటప్పుడు ఎడమ మూతకు రెప్ప కొలతప్రకారం కోసుకో వలయును. రెప్ప మధ్య ఖాళీ ఆరు అంగుళాలు, అయిదున్నర అంగుళాలు వుంచుదురు. తరువాత మేకచర్మము తెచ్చి లోపలవేసి కుట్టవలయును. దీనినే 'ఎడమ జోడించుట' అంటారు. ఈ జోడింపుతో ఎడమ మూత తయారు అయినట్లు భావించవలయును.

## కరిణ వేసే క్రమము

చిట్టపు రాళ్లు తెచ్చి బాగా పొడిచేసి వస్త్రకాయం పట్టి ఆ పొడిని తిరిగి కల్వంలో వేసి నీళ్లు పోసి కాటుకలాగ నూరవలెను. ఆ నూరిన మందు కరిణకు సరిపోవునది తీసుకొని కొంచెము అన్నము వేసి బాగా పాకం వచ్చేలాగున నూరి వుంచవలెను. అప్పుడు మృదంగము యొక్క కుడి మూతకు కొలతప్రకారము కరిణ వేసేటంతవరకు అంటు వేయవలయును, ఆ అంటు

అన్నముతోగాని, సర్వీసుతోగాని వేయవలయును. అంటు ఆరిన తరువాత కరిణ ప్రారంభించ వలయును. చిన్న చిన్న వుండలుగా తీసుకొని ఎత్తు పల్లములు రాకుండా కరిణ వేసే స్థలము వరకు మందు పెట్టి రాయితో రుద్దవలయును. రాయితో రుద్దే వేడితోనే కరిణ ఆరిపోతూ వుండవలయును. తగ్గు శ్రుతుల కయితే ఎక్కువ కరిణ వేయవలయును. హెచ్చు శ్రుతుల కయితే కొంచెము తక్కువ కరిణ వేస్తారు. మూతకు సరిపోవు కరిణ వేసిన తరువాత మీటు, నాటు సరిపోవులాగున సర్దుకో వలయును. మీటు అనగా మూతకు చుట్టూవున్న రెప్ప, నాటు అనగా కరిణకు వుండు మధ్యభాగము, చాపు అనగా నాటు, మీటుల మధ్య భాగము, అరచాపు అనగా ముందుభాగమున కొట్టుట అని తెలియవలయును.

## కరిణను శ్రుతిపక్వంగా సర్దే క్రమము

నాటు, మీటు, చాపు, అరచాపు అని నాలుగు విధములు. పై నాల్గింటిని గురించి వ్రాయడ మయినది. నాటు తక్కువ అయితే కరిణ మధ్యభాగములో కొంచెము మందు వేయవలయును. నాటు ఎక్కువ అయితే కరిణ చుట్టూ కొంచెము మందు వేయుట గాని, కరిణ మధ్య కొంచెము మందు గీయుటగాని చేయవలయును. అట్లు వేస్తూ నాటు, మీటు సరిపోయేలాగున సర్దుకోవలయును.

## బోనం

బోనం అనగా మృదంగం వాయించుటకు ముందు ఎడమవైపున వుపయోగిస్తారు. పూర్వము పిడకలు కాల్చిన కచ్చికలు, అన్నం కలిపి బాగా నలిపి మంచి జిగురు వచ్చిన తరువాత దానిని ఎడమకు పెట్టి వాయించెడివారు. ఇప్పుడు బొంబాయి రవ్వగాని, గోధుమపిండిగాని ఉపయోగిస్తూ యున్నారు. రవ్వగాని, పిండిగాని తడిపితే చాలు జిగురు వస్తుంది. అట్లు జిగురు వచ్చినదానిని ఎడమచర్మాన్ని కొంచెము తడిపి జిగురు వచ్చిన పిండినిపెట్టి వాయించు కోవలయును. అప్పుడు ఎడములో మంచి ఓంకారము వచ్చును. మృదంగం శ్రుతి తగ్గకుండా ఉండుటకు ఎడమ మూతకు ప్రక్కన వారు క్రింద ఎనిమిది పుల్లలు పెట్టుదురు.

## శ్రుతి చేయు పద్ధతి

మృదంగం శ్రుతిచేయుటకు ఒక రాయి, నాలుగు అంగుళముల పొడవుగల పుల్ల ఉపయోగించవలయును. కొంతమంది సుత్తిని ఉపయోగిస్తారు. శ్రుతి హెచ్చవలసివస్తే మూత చుట్టూ వున్న బొద్దుపైన కొట్టవలయును. తగ్గించవలసివస్తే బొద్దుక్రిందను పుల్లనుబెట్టి రాయితో కొడితే తగ్గుతుంది. మృదంగమునకు చుట్టూ కట్టుటకు మంచి గుడ్డ, కుడివైపుకు మంచి టోపీ కుట్టించవలయును. పైన తొడుగుటకు వాటర్‌ప్రూఫు గుడ్డతో సంచి కుట్టించవలయును. సంచి, గుడ్డ గాకుండా మంచి మృదంగం ఖరీదు 150-00 రూపాయల నుంచి 200-00 రూపాయల వరకు వుండును. పై మాదిరిగా తయారయిన మృదంగం పాట కచేరీలకు వాయించుకోవచ్చును.

## మృదంగం ఉత్పత్తి

శ్లో. తతం వీణాదికం వాద్యం ఆనద్ధం మురజాదికం
వంశాది కంతు సుషిరం కాంస్యం తాలాదికం ఘనం

అని చెప్పబడి యుండుటచే తతవాద్యము లనగా తంత్రులతో సంబంధించిన వాద్యములున్నూ, ఆనద్ధము లనగా చర్మముచే ముఖములు మూయబడి ధ్వని విశేషమును ఉత్పత్తి చేయుటకు హేతువులైన భేరీ, మృదంగాది వాద్యములున్నూ, సుషిరము లనగా చిల్లులు పెట్టబడి ఊదుటచే మధుర ధ్వనులు పుట్టునట్లు వీలైన వేణువు, నాదస్వరము మొదలగు వాద్యములున్నూ, ఘనము లనగా కంచు లోహముచే చేయబడిన వాద్యవిశేషములున్నూ, ఇట్లు నాలుగు విధములుగా వాద్యములు ఆర్షప్రోక్తములై భారతీయుల స్వామ్యత నందుకొన్నవి.

### ఆనద్ధములు

చర్మముచే మూయబడిన వాద్యవిశేషము. భేరీ, మర్దలము, ఢక్క, వీరణము, కంజిరా, తాషా, తప్పెట, డోలు, రుంజ మొదలయినవి. రూపభేదమునుబట్టి ధ్వనులు కూడ భిన్నములుగా ఉండటం మన కనుభవమే. భిన్నరీతులైన వాద్యములు సమయానుకూలములైన వనుటకు నిదర్శనంగా భేరీవాద్యం యుద్ధప్రయాణ సమయములోనూ, వీరణము వివాహ సమయములోనూ, కనకతప్పెట్లు మొదలయినవి కీర్తిని ప్రకటించుటకున్నూ, గంటలు మొదలయినవి దేవతార్చనా సమయములోనూ — ఇట్లు ఆచారముల వలన తెలిసికొనవచ్చుచు.

### మృదంగము

ఆకాశం శబ్దగుణక మనే అనుభవంతో ధ్వని విశేషోత్పత్తికి అనుకూలముగా ఆకాశగర్భితమయిన తత, ఆనద్ధ, సుషిర, ఘనాది వాద్యములు నిరూపితము లయినవి. మొదటి మూడు వాద్యములూ దారుమయములే. శాస్త్రకర్తయైన ప్రముఖాచార్యుడు భరతమహర్షి మృదంగమును గూర్చి సార్థహస్తము పొడవుగనూ, నడుము లావుగనూ, ఆకాశగర్భిత మయిన దీని రెండు ముఖములూ చర్మముచే పినద్ధమై ఎడమచేతితో వాయించ వలసినవైపున 12 గాని 13 గాని అంగుళముల కొలతయూ, కుడిచేతితో మ్రోయించు వైపున 8 అంగుళముల కొలతయు కలిగి మధురధ్వని పుట్టింప తగినది మర్దలము అని ఒక విధమయిన లక్షణ గౌరవము నిచ్చారు. రక్తచందన దారువుతో చేసినది గంభీరధ్వని నిస్తుందని అభివర్ణించారు.

ఈ వాద్యమునకు మృదంగము, మురజము, మర్దలము, అంక్యము, ఆలింగ్యము, ఆనద్ధము, ఊర్ధ్వకము అనే పేర్లు సార్థకములు.

మృదంగము = మృత్తు (మన్ను) అంగముగా కలది కనుక మృత్ + అంగము = **మృదంగము అనుట సార్థకము.**

మురజ = (మురవేష్టనే) చర్మముచే మూయబడినది.

అంక్యము = వాయించువేళ తొడపయి నుంచుకొన తగినది.

ఆలింగ్యము = నడుమప్రదేశమున వాదకులు విశ్రాంతి సమయమున చేయి దానిపై నుంచుకొనుటచే ఆలింగనభావానుకూల మయినది.

ఊర్ధ్వకము = వాదనావసరము లేనపుడు కుడివైపు ఊర్ధ్వముగా నిలువపెట్టబడి యుండుటచే ఊర్ధ్వకమని పేరు.

ఇట్టి మృదంగ వాద్యము నాట్యభావోద్దీపకముగా యశస్సు నిలువచేసికొన్నది. వేణువు, వీణ వలెనే మృదంగము వేదకాల ప్రతిపాదితము.

## రగణమఠ్య తాళము

ఇది ప్రాచీనకాలమలో సంగీత రచనలందు ఉపయోగింపబడు ఒకవిధమగు తాళ కాల ప్రమాణ మగును. దీనికి గురువు, చతురశ్రలఘువు, గురువు గలిగి 8+4+8=20 అక్షరకాలములు ఉండును. దీనినే పూర్వీకులు రగణమఠ్య తాళమని చెప్పియుండిరి. 8 | 8

## ఝుల్వ తాళము

ఇది త్రిశ్రగతి. మూడక్షరములకు ఒకసారి ఘాత వేయవలెను.

## ప్రస్తారములు

| ద్రుతము | | ద్రుత విరామము | | లఘువు | |
|---|---|---|---|---|---|
| 1 | O | 1 | ℧ | 1 | I |
| 2 | U U | 2 | U O | 2 | O O |
| | | 3 | O U | 3 | U U O |
| | | 4 | U U U | 4 | U O U |
| | | | | 5 | O U U |
| | | | | 6 | U U U U |

## హిందుస్థానీ సంగీతమునకు, కర్ణాటక సంగీతమునకు గల భేదము

హిందుస్థానీ సంగీతము, కర్ణాటక సంగీతము అను భేదము ఏర్పడని కాలమున ఈ సంగీతము భారతీయ సంగీతమని పిలువబడుచుండెడిది. మహమ్మదీయులు రాజ్యపరిపాలనకు వచ్చిన తర్వాత భారతీయ సంగీతము హిందుస్థానీ సంగీతము, కర్ణాటక సంగీతము అను రెండు పద్ధతులుగ మార్పుచెందినది. మహమ్మదీయులు వారి పరిపాలనా ప్రాంతమందు వారి సంగీత పద్ధతులను అప్పటి భారతీయ సంగీత పద్ధతులతో మేళవించి ఒక నూతన సంగీత పద్ధతిని

సృష్టింపజేసి ప్రోత్సహించిరి. దక్షిణదేశమునందు భారతీయ సంగీత సంప్రదాయము మార్పు చెందక పురాతన పద్ధతులపై కొంత అభివృద్ధిచెందినది. రెండు పద్ధతులకు శ్రుతి, స్వర, లయ, రాగ, తాళములలో వ్యత్యాసము లేనప్పటికి, ఏ పద్ధతి కా పద్ధతి ప్రత్యేకముగ అభివృద్ధి చెందినది. హిందుస్థానీ పద్ధతిలో హరిదాసస్వామి, తాన్‌సేన్, సదారంగ్, అదారంగ్, మొదలగు వాగ్గేయకారులు ద్రుపద్, ధమార్, ఖ్యాల్, టూరీ, టప్పా, హోరీ మొదలగు రచనలు చేసిరి. పురందరదాసు, క్షేత్రయ్య, త్యాగరాజు, ముత్తుస్వామిదీక్షితులు, శ్యామశాస్త్రి, స్వాతితిరునాళ్ మొదలగు వాగ్గేయకారులు వర్ణము, స్వరజతి, కృతి, పదము, జావళీ, తిల్లానా మొదలగు రచనలు చేసిరి.

ఈ పద్ధతుల యొక్క శైలి కూడ ప్రత్యేకముగ నుండును. హిందుస్థానీ శైలి జారు ప్రాధాన్యమైనది. కర్ణాటక శైలి గమక ప్రాధాన్యమైనది. శుద్ధ, జంట, దాటు అను స్వరములు, అన్యస్వరములు, గమకములు వాడుటలో రెండు పద్ధతులకు ఆ యా ప్రాంతముల భాషనుబట్టి పలుకుబడులు వేరువేరుగ నుండును. సంగీతప్రదర్శనలో హిందుస్థానీ విద్వాంసులు సంగీత రచన, మనోధర్మ సంగీతము రెండూ ఒకేసారి ప్రదర్శించెదరు. కర్ణాటక సంగీతమునందు విద్వాంసులు మనోధర్మ సంగీత అంశము లయిన రాగము, తానము, స్వర కల్పన, నెరవు, పల్లవి మొదలయిన వాటిని కృతి, పదము, జావళీ, తిల్లానా మొదలయిన కల్పిత సంగీత రచనలతో కలిపి గాకుండా, వేరుగా ప్రదర్శించెదరు. విలంబ, మధ్యమ, ద్రుతకాల సంచారములు హిందుస్థానీ సంగీతములో వేటి కవి ప్రత్యేక ప్రాధాన్యమును కలిగి యున్నవి. ప్రస్తుత కర్ణాటక గానములో విలంబకాల సంచారముల కంటె మధ్యమ, ద్రుత కాల సంచారములు ఎక్కువగ నున్నవి. ప్రక్కవాద్యములకు కర్ణాటక సంగీతములో ఉన్నంత, హిందుస్థానీ సంగీతములో ఎక్కువ స్వాతంత్ర్యము లేదు. కర్ణాటక సంగీతములో రాగము, స్వరకల్పన, ప్రక్కవాద్యములు తనిగా వాయించుట వాడుకలో నున్నది. కర్ణాటక గాయకుడు తాళమును వేసుకొని పాడుట వలన, లయ వాద్యములు స్వతంత్రించి వాయించుటకు వీలు కలుగుచున్నది. హిందుస్థానీ గాయకుడు తాళము వేసుకొనకుండ తబలా వాద్యకుని లయను ఆధారముచేసుకొని పాడును. అందువలన తబలా వాద్యముకు స్వాతంత్ర్యము తక్కువ.

## పంచముఖ వాద్యము

ఈ వాద్యము పరిమాణములో మిగుల పెద్దదియై గుండ్రని ఆకారములో నుండును. ఇది పంచలోహ మిశ్రముగా తయారుచేయబడిన ప్రాచీన వాద్యము. బిందె ఆకారముగల యీ వాద్యము యొక్క పైభాగమున మధ్యగా నొకటి, చుట్టూ మరి నాలుగు గొట్టములవలె నుండును. మధ్యనుండు గొట్టము యొక్క వ్యాసము లేక వెడల్పు మిగతా నాలుగు గొట్టములకన్న వెడల్పుగా నుండును. ఈ అయిదు గొట్టములు మేకచర్మముతో మూయబడును. మధ్యగొట్టమునకు మృదంగపు మూతవలె పైన రెప్పచర్మము కూడ నుండును. దీనికి లేగదూడచర్మము కూడ ఉపయోగించుట కలదు. ఈ చర్మములు త్రాళ్ల సహాయముతో బిగింపబడి యుండును.

పంచముఖ వాద్యము తనిగాను, మరియు శుద్ధమద్దళముతో కూడ కలిపి వాయించు చుందురు. పంచముఖ వాద్యముపై రమణీయ మయిన లయ విన్యాసములు ప్రదర్శించుదురు.

ఈ వాద్యము ముఖ్యముగా తంజావూరు జిల్లాలో ఆలయోత్సవములలో ఎక్కువగా ఉపయోగింపబడుచున్నది. ఈ వాద్యము చక్రములు గల చిన్న కర్రబండిపై అమర్చుదురు. ఇట్లమర్చుట వలన ఇది మిగుల బరువయిన వాద్య మయినప్పటికి, ఒకచోటనుండి మరియొకచోటికి సులభముగా తరలించుటకు వీలగును. పంచముఖ వాద్యమునకు ప్రక్క "కుడముజములు" అను మరి రెండు వాద్యములు ఆధార షడ్జ పంచమములకు శ్రుతిచేసి, పురాతన షడ్జగ్రామమును ప్రదర్శించవచ్చును. లయ వాద్య మన్నిటిలో బరువయిన యీ వాద్యము షుమారు 30 మణుగులు బరువుండును.

పైన నుండు మూతకు, క్రింద నుండు మూతకు పలుచని చర్మము వాడుదురు. ప్రక్కనున్న రెండు మూతలకు పైవాటికన్నా కొలదిగా మందముగానున్న చర్మములను వాడుదురు. మధ్యనుండు మూతకు బాగా మందపు చర్మము వాడుదురు.

ఇది వాయించువారు "వామదేవ" మను మూత ఉండువైపు నిలబడి వాయించుదురు. మధ్యనుండు మూత, తక్కిన నాలుగు మూతలకన్న కొంత ఎత్తుగ నుండును. ప్రక్కనుండు "కుడముజములు" మట్టితో చేయబడిన కుండలపై చర్మపు మూతలతో చేయుదురు. "కుడముజములు" షడ్జ, పంచమములు ధ్వనించగా, పంచముఖ వాద్యము యొక్క అయిదు మూతలు షడ్జగ్రామములో రి, గ, మ, ద, ని లు ధ్వనింప జేయును.

ఈ అయిదు ముఖములు గల వాద్యము తిరువారూరుగుడిలోను, తిరుత్తురైపూండి గుడిలోను కాన నగును. దేవాలయములలో వాయించబడు యీ వాద్యము చాలా శిల్ప ములలో కూడ చూడవచ్చును.

ఈ వాద్యపు మధ్య ఎత్తుగను, విశాలముగను ఉన్న ముఖమునకు ( మూత ) "ఈశానం" అని పేరు. ఇది ఆధారషడ్జము పలుకును. ఎడమవైపు ముఖము "సద్యోజాతం" శుద్ధ మధ్యమము. కుడి ముఖము "తత్పురుషం" పంచమము. క్రిందిది అనగా తూర్పుముఖము "అఘోరం" శుద్ధ గాంధారం. పైముఖము "వామదేవం" చతుశ్రుతి రిషభము పలుకును. ఇవి అన్నియు రెండు చేతులతో వాయించునపుడు అఖండమయిన శబ్దము వెలువడును. దీనికి తోడుగా జాల్రా, తవిల్ వాయింపబడును. దీనిని ఇప్పటికిని శ్రీ ముత్తుస్వామిదీక్షితుల పరంపరలోనివారే వాయింతురు. గజారోహణోత్సవ మప్పుడు యీ వాద్యము వాయింపబడుచున్నది.

ఈ వాద్యమునకు ఉన్న అయిదు ముఖములు సద్యోజాతము, తత్పురుషము, ఈశానం, అఘోరము, వామదేవము అనబడు పరమశివుని 'పంచముఖము' లని చెప్పబడినవి. అందువలననే ఇది పంచముఖవాద్య మయినది.

## హిందుస్థానీ సంగీతములో ప్రఖ్యాతిగాంచిన తాళములు

| | | | |
|---|---|---|---|
| 1. | త్రితాల్ | 7. | రూపక్ |
| 2. | తిల్‌వాడా | 8. | ఝుమరా |
| 3. | ఏక్ తాల్ | 9. | ధమార్ |
| 4. | ఝప్ తాల్ | 10. | ఆడాచౌతాల్ |
| 5. | చౌతాల్ | 11. | దీప్‌చన్దీ |
| 6. | దాద్రా | 12. | కహరవా |

## హిందుస్థానీ తాళములు, వాటిలక్షణము

తాలీ అనగా దెబ్బ
ఖాలీ అనగా ఉసి

1 త్రితాల్ - 16

మాత్రలు - 16
తాలీలు - 3 (1-5-13 మాత్రల యందు)
ఖాలీ - 1 (9-వ మాత్ర యందు)
విభాగములు - 4 (ఒక్కొక్క విభాగమునందు నాలుగు మాత్రలు చొప్పున)

ఠేకా

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ధా | ధిన్ | ధిన్ | ధా | ధా | ధిన్ | ధిన్ | ధా | ధా | తిన్ | తిన్ | తా | తా | ధిన్ | ధిన్ | ధా |
| x | | | | 2 | | | | 0 | | | | 3 | | | |

2 తిల్‌వాడా - 16

ఠేకా

| | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ధా | తెరికిట | ధిన్ | ధిన్ | ధా | ధా | తిన్ | తిన్ | తా | తెరికిట | ధిన్ | ధిన్ | ధా | ధా | ధిన్ | ధిన్ |
| x | | | | 2 | | | | 0 | | | | 3 | | | |

3 ఏక్‌తాల్ - 12

మాత్రలు - 12
తాలీలు - 4 (1-5-9-11 మాత్రల యందు)
ఖాలీలు - 2 (3-7 మాత్రల యందు)
విభాగములు - 6 (ఒక్కొక్క విభాగమునందు రెండు మాత్రలు చొప్పున)

ఠేకా

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ధిన్ | ధిన్ | ధాగీ | తెరికిట | తూ | నా | క | త్తా | ధాగీ | తెరికిట | ధీ | నా |
| × | | 0 | | 2 | | 0 | | 3 | | 4 | |

**4 ఝప్‌తాల్ - 10**

మాత్రలు - 10
తాలీలు - 3 (1-3-8 మాత్రల యందు)
ఖాలీ - 1 (6-వ మాత్ర యందు)
సమ్ - ప్రథమమాత్రయందు
విభాగములు - 4 (ఒక్కొక్క విభాగమునందు 2-3-2-3 మాత్రల చొప్పున)

ఠేకా

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ధీ | నా | ధీ | ధీ | నా | తీ | నా | ధీ | ధీ | నా |
| × | | 2 | | | 0 | | 3 | | |

**5. చౌతాల్ - 12**

ఈ తాళమునందు ఠేకా మాత్రము ఏక్ తాల్‌కు భేదించును. మిగిలిన శాస్త్రీయ లక్షణము లన్నియు ఏక్ తాల్‌ను పోలి యుండును.

ఠేకా

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ధా | ధా | ధిన్ | తా | కిట | ధా | ధిన్ | తా | తిట | కత | గది | గన |
| × | | 0 | | 2 | | 0 | | 3 | | 4 | |

**6 దాద్రా - 6**

మాత్రలు - 6
తాలీ - 1 (ప్రథమమాత్ర యందు)
ఖాలీ - 1 (4-వ మాత్ర యందు)
విభాగములు - 2 (ఒక్కొక్క విభాగమునందు 3 మాత్రలు చొప్పున)

ఠేకా :

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | \| | 4 | 5 | 6 |
| ధా | గీ | నా | \| | ధా | తూ | నా |
| x | | | \| | 0 | | |
| ధా | గీ | నా | \| | ధా | తూ | నా |
| x | | 2 | \| | 0 | | |

7 రూపక్ - 7

మాత్రలు - 7

తాలీలు - 3 ( 1 - 4 - 6 మాత్రల యందు )

ఖాలీ - లేదు

విభాగములు - 3 ( ఒక్కొక్క విభాగమునందు 3 - 2 - 2 మాత్రలు చొప్పున )

ఠేకా

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | \| | 4 | 5 | \| | 6 | 7 |
| తీ | తీ | నా | \| | ధీ | నా | \| | ధీ | నా |
| x | | | \| | 2 | | \| | 3 | |

8 ఝుమరా - 14

మాత్రలు - 14

తాలీలు - 3 ( 1 - 4 - 11 మాత్రల యందు )

ఖాలీ - 1 ( 8- వ మాత్ర యందు )

విభాగములు - 4 ( ఒక్కొక్క విభాగమునందు 3 - 4 - 3 - 4 మాత్రలు చొప్పున )

ఠేకా

| | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 |
| ధిన్ | ఽధా | తెరికిట | ధిన్ | ధిన్ | ధాగి | తెరికిట | ధిన్ | ఽతా | తెరికిట | ధిన్ | ధిన్ | ధాగి | తెరికిట |
| x | | | 2 | | | | 0 | | | 3 | | | |

9 ధమార్ - 14

మాత్రలు - 14
తాలీలు - 3 (1 - 6 - 11 మాత్రల యందు)
ఖాలీ - 1 (8-వ మాత్ర యందు)
విభాగములు - 4 (ఒక్కొక్క విభాగమునందు 5 - 2 - 3 - 4 మాత్రలు చొప్పున)
ఠేకా

| 1 2 3 4 5 | 6 7 | 8 9 10 | 11 12 13 14 |
|---|---|---|---|
| క ద్ధి ట ధి ట | ధా ఽ | గ త్తి ట | తి ట తా ఽ |
| × | 2 | 0 | 3 |

10 ఆడాచౌతాల్ - 14

మాత్రలు - 14
తాలీలు - 4 (1 - 3 - 7 - 11 మాత్రల యందు)
ఖాలీలు - 3 (5 - 9 - 13 మాత్రల యందు)
విభాగములు - 7 (ఒక్కొక్క విభాగమునందు 2 మాత్రలు చొప్పున)
ఠేకా

| 1 2 | 3 4 | 5 6 | 7 8 | 9 10 | 11 12 | 13 14 |
|---|---|---|---|---|---|---|
| ధిన్ తెరికిట | ధీ నా | తూ నా | క త్తా | తెరికిట ధీ | నా ధీ | ధీ నా |
| × | 2 | 0 | 3 | 0 | 4 | 0 |

11 దీప్చందీ - 14

మాత్రలు - 14
తాలీలు - 3 (1 - 4 - 11 మాత్రల యందు)
ఖాలీ - 1 (8 - వ మాత్ర యందు)
విభాగములు - 4 (ఒక్కొక్క విభాగమునందు 3 - 4 - 3 - 4 మాత్రలు చొప్పున)
ఠేకా

| 1 2 3 | 4 5 6 7 | 8 9 10 | 11 12 13 14 |
|---|---|---|---|
| ధా ధిన్ ఽ | ధా ధా తిన్ ఽ | తా తిన్ ఽ | ధా ధా తిన్ ఽ |
| × | 2 | 0 | 3 |

12 కహరవా - 4

మాత్రలు - 4

ఠేకా




## అష్టోత్తర శతతాళముల నామములు

| వరుస సంఖ్య | తాళముల పేర్లు | అంగములు | మాత్రలు | అక్షరములు |
|---|---|---|---|---|
| 1 | చచ్చత్పుట | ఽ ఽ । ఽ̍ | | 32 |
| 2 | చాచత్పుట | ఽ । । ఽ | | 24 |
| 3 | షట్పితాపుత్రిక | ఽ̍ । ఽ ఽ । ఽ̍ | | 48 |
| 4 | సంపద్వేష్టక | ఽ̍ ఽ ఽ ఽ ఽ̍ | | 48 |
| 5 | ఉద్ఘట్టము | ఽ ఽ ఽ | | 24 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 6 | ఆదితాళము | 19 | వీరవిక్రమ | 32 | సింహనాద |
| 7 | దర్పణ | 20 | హంసలీల | 33 | మల్లికామోద |
| 8 | చర్చరి | 21 | వర్ణభిన్న | 34 | శరభలీల |
| 9 | సింహలీల | 22 | రంగద్యోత | 35 | రంగాభరణ |
| 10 | కందర్ప | 23 | రాజచూడామణి | 36 | తురంగలీల |
| 11 | సింహవిక్రమ | 24 | రాజతాళము | 37 | సింహనందన |
| 12 | శ్రీరంగ | 25 | సింహవిక్రీడిత | 38 | జయశ్రీ |
| 13 | రతిలీల | 26 | వనమాలి | 39 | విజయానంద |
| 14 | రంగతాళము | 27 | చతురశ్రవర్ణ | 40 | ప్రతితాళము |
| 15 | పరిక్రమ | 28 | త్ర్యశ్రవర్ణ | 41 | ద్వితీయ |
| 16 | ప్రత్యంగ | 29 | మిశ్రవర్ణ | 42 | మకరంద |
| 17 | గజలీల | 30 | రంగప్రదీప | 43 | కీర్తి |
| 18 | త్రిభిన్న | 31 | హంసనాద | 44 | విజయ |

45 జయమంగళ
46 రాజవిద్యాధర
47 మధ్యతాళము
48 జయతాళము
49 కుడుక్క
50 నిస్సారుక
51 క్రీడ
52 త్రిభంగి
53 కోకిలప్రియ
54 శ్రీకీర్తి
55 బిందుమాలి
56 సమతాళము
57 నందనతాళము
58 ఉదీక్షణ
59 మట్టిక
60 ఢేంగిక
61 వర్ణమట్ట
62 అభినందన
63 అంతరక్రీడ
64 మల్లతాళము
65 దీపిక
66 అనంగ
67 విషమ
68 నంది
69 ముకుంద
70 కందుక
71 ఏకతాళము
72 అట
73 పూర్ణకంకాళ
74 ఖండకంకాళ
75 సమకంకాళ
76 విషమకంకాళ
77 చతుస్తాల
78 డోంబులి
79 అభాంగ
80 రాయవంకోల
81 లఘుశేఖర
82 ప్రతాపశేఖర
83 జగఝంప
84 చతుర్ముఖ
85 ఝంప
86 ప్రతిమఠ్య
87 గారుగి
88 వసంత
89 లలిత
90 రతి
91 కర్ణయతి
92 యతి
93 షట్తాల
94 వర్ధన
95 వర్ణయతి
96 రాజనారాయణ
97 మదన
98 కారికా
99 పార్వతీలోచన
100 శ్రీనందన
101 లీల
102 విలోకిత
103 లలితప్రియ
104 ఝల్లక
105 జనక
106 లక్ష్మీశ
107 రాగవర్ధన
108 ఉత్సవతాళము

# బుగత గోపన్నగారి తోధిమి శబ్దములు

ఆదితాళం　　　　　　　　　　　　మధ్యమ కాలము

| 1. లఘువు | ౦. ద్రుతము | ౦. ద్రుతము | |
|---|---|---|---|
| తో ధి మి , , తో ధి మి త తో ధి మి | ధీ , , , ఢ్ఘే క | త దీ ద్దీ ధిక్కిట తక | (1) |
| ద్ధిరుగుడు తకతక , , తద్ధిరుగుడు తకతక , , తః త్త్కణంకిటతక | ద్ధిరుగుడు తకతక,, తద్ధిరుగుడు | తకతక , , తః త్త్కణం కిటతక | |
| ద్ధిరుగుడు తకతక , , తద్ధిరుగుడు తకతక , , తః త్త్కణంకిటతక | త క , ధి కి, కి ట త క | , , కిటతక తకతధిగిణ తోం | |
| త క, ధి కి, కి ట త క , , కిటతకతకతధిగిణతోం | త క , ధి కి, కి ట త క | , , కిటతక తకతధిగిణ తోం | |
| త త రి త రి త ధి త ధి త హా త హా త ది కు | ధి కు ధి మి ధి మి ద రి | ద రి ణ త ణ త ఝు ణు | (2) |
| ఝు ణు గ ధి గ ధి త క త క కి ణ కి ణ ధ ణ | ధ ణ జ గ జ గ ణ గ | ణ గ త గ త గ ది గి | |
| కిణతకతక /కిణతక /ఝుణుతక తక /ఝుణు తక /ధిమితకతక /తరిదిగి/తక | ధిః తాంగిటతోం , , కిణతక | తకకిణతక / ఝుణు తకతక / ఝుణుతక / | |
| ధిమితకతక / తరిదిగి / తకధిః తాంగిటతోం , , కిణతకతక / కిణ | తక / ఝుణుతకతక / ఝుణు తక / ధిమితక | తక / తరిదిగి / తకధిః తాంగిట తోం | |
| తః త్త ఝం కు తక , , త ఝం కు తక | త ఝం ఝం కు త క | , ఝం కు తక తఝం | (3) |
| త రి కూం, త రి ధాం, ద ణ త ఝ్ఞుం ధ ణ | తాం, తకిట త క | గ ధీం ధిమి తకిట | |
| త ఝ్ఞు ణు , , తః ధి మి , , తః గధి,, తః ధ రి , , ద రి కి ట తక ఝ్ఞుం తరి తధిగిణతోం ,,,, త ఝ్ఞుణు | | ,, త్తఃధిమి ,, తఃగధి ,, తః | |
| తరి , , దరికిటతక ఝ్ఞుం తరితధిగిణతోం ,,,, త ఝ్ఞుణు , , తః | ధిమి ,, తఃగధి ,, తః ధరి ,, | ధరికిటతక ఝ్ఞుంతరి తధిగిణతోం | |

# జీవితచరిత్రలు

## శ్రీ పుదుక్కోట మాన్‌పూండియాపిళ్లేగారు

శ్రీ మాన్‌పూండియాపిళ్లేగారు పుదుక్కోట సంస్థానమునకు చెందినవారు. వీరి చిన్ననాటి అనుభవాలను గురించి ఎక్కువ తెలియకపోయినా, ఈయనకు సంగీతంలో పెద్ద యోగ్యత ఉన్నదని బాగా తెలియును.

కంజిరా తాళవాద్యముల కోవకు చెందిన ఒక చిన్నవాద్యం. దీనిని కచేరీలలో ప్రక్కవాద్యముగా ప్రవేశపెట్టిన ఘనత ఆయనకే దక్కింది. అంతకుపూర్వం కంజిరా వాద్యం కేవలం భజనగోష్ఠులలో మాత్రమే ప్రక్కవాద్యంగా ఉపయోగించేవారు. ఈ వాద్యం యొక్క నాదం చెవికి అంత ఇంపుగా ఉండేది కాదు. దీనిని ఒక్కచేతితో మాత్రమే వాయించేవారు. కాని, శ్రీ పిళ్లేగారు ఈ వాద్యమునందు రెండవ చేతితో గూడ ''ఘుం, ఘుం'' అనే శబ్దం సమయోచితంగా కలుగజేస్తూ, అనేక క్లిష్టమయిన నడకలు నడుపుతూ, అనేక విన్యాసాలు చేస్తూ సర్వజనరంజకంగా చేసిన ప్రతిభా సంపన్నులు. ''తధిగిణ తోం'' అనే శబ్దం, ఇంకా అనేక విషమ మోరాలు తాళవాద్య ప్రకాండులకు సయితం ఆశ్చర్యమును కలిగించే విధంగా ప్రయోగించేవారు. ఆయన ప్రక్కవాద్యం వాయించునపుడు లయలో ఎంతో సమర్థుడైన గాయకుడు పాడిన మాత్రమే కచేరీ రక్తిగా నడచేది. లేనియెడల రసాభాసమే! ప్రముఖ విద్వాంసులైనప్పటికి కొందరు వీరి వాద్యం ప్రక్కన పెట్టుకొనుటకు సాహసించేవారు కారు. సుప్రసిద్ధులయిన శ్రీ కోనేరిరాజపురం వైద్యనాథయ్యర్ వీరితో చిన్నప్పటినుంచి స్నేహంచేసి, వీరి వద్ద లయసంబంధమయిన అనేక మెళుకువలను తెలుసుకొని వీరి ప్రక్క వాద్యంతో కచేరీలో అనేక లయ విన్యాసములను చూపుతూ సమర్థమైన, రక్తిమైన గానం చేసేవారు. శ్రీ పిళ్లేగారి శిష్యులలో శ్రీ పుదుక్కోట దక్షిణామూర్తిపిళ్లేగారు, శ్రీ పళని ముత్తయ్యాపిళ్లేగారు ప్రముఖులు. శ్రీ మాన్‌పూండియాపిళ్లేగారు తమ 65-వ ఏట స్వర్గస్థు లయిరి.

# శ్రీ పుదుక్కోట దక్షిణామూర్తిపిళ్లేగారు

వీరి స్వగ్రామం పుదుక్కోట. ఆ సంస్థానములోనే బాల్యంలో చిన్న ఉద్యోగిగా ఉండేవారు. పుదుక్కోట సంస్థానములో దసరా మొదలైన ఉత్సవాల్లో గొప్ప విద్వాంసుల సంగీత కచేరీలు జరిగేవి. సహజంగా చక్కని లయజ్ఞానం కలిగిన శ్రీ దక్షిణామూర్తి పిళ్లేగారు ఈ ప్రసిద్ధుల కచేరీలలో ప్రక్కవాద్యాల ధోరణి తెలుసుకొని ఘటవాద్యం సాధకం చేసి కొన్ని కచేరీలకు వాయించేవారు. దీనితో తృప్తి కలుగక ప్రసిద్ధ కంజిరా విద్వాంసు లయిన శ్రీ పుదుక్కోట మాన్‌పూండియాపిళ్లేగారివద్ద గురుకులవాసం చేసి కంజిరా వాద్యంలో నైపుణ్యం గడించారు. అంతేకాక మృదంగం కూడా సాధకం చేసి నిపుణు లయ్యారు. ఆకాలంలో మృదంగ విద్వాంసులంతా ప్రథమంలో కొద్దిరోజు లయినా హరికథలకు ప్రక్కవాద్యం వాయించవలసి ఉండేది. అటుతరువాతే వారికి కచేరీలకు వాయించే అవకాశం కలిగేది. అందువల్ల ఆయన తంజావూరు వచ్చి శ్రీ నారాయణస్వామి అప్పగారు నిర్వహించే ప్రసిద్ధ భజనగోష్ఠులకు, శ్రీ తిరుపుళణం పంచాపకేశభాగవతార్ గారి కథలకు కొన్నిటికి, తరువాత ప్రసిద్ధ హరికథకు లయిన శ్రీ మాంగుడి చిదంబరభాగవతార్ గారి కథలలో మృదంగం వాయించి తరువాత అనేక సంగీత కచేరీలకు మృదంగం, కంజిరా అనుసరణచేసి రసికులను రంజింపచేశారు. ఆయన కంజిరావాద్యం తన గురువుగారి కంజిరా వాద్యాన్ని మించి ఉండేదని ఆనాటి పెద్దలు చెప్పేవారు. అది ఆయన గురువుల అనుగ్రహం. ఆయన మృదంగం అభ్యసించేటప్పుడు చేతివ్రేళ్లు ఆయనకు పూర్తిగా స్వాధీనమయేవి కావు. కాని ఆయన కఠాతపస్వి, గురుభక్తుడు, మేధాసంపన్నుడు అయినందువల్ల కొన్ని చక్కని జతులు స్వయంగా తయారుచేసి మృదంగవాద్యంలో ప్రదర్శించి రసికుల మన్ననలు పొందారు. పదిహేను సంవత్సరములు ఆయన మృదంగం వాయించారు. ఆయన ప్రసిద్ధ విద్వాంసు లయిన శ్రీ కోనేరిరాజపురం వైద్యనాథయ్యర్, శ్రీ పూచి శ్రీనివాసయ్యంగార్, శ్రీ పల్లడం సంజీవరావు, శ్రీ టైగర్ వరదాచారి, కారైకుడి సోదరులు మొదలయిన వారికి మృదంగాను సరణ చేశారు. లయ విన్యాసంలో ఖ్యాతిగాంచిన శ్రీ కారైకుడి సోదరులకు ఎన్నో కచేరీలలో శ్రీ దక్షిణామూర్తిపిళ్లేగారు మృదంగం వాయించడం ప్రత్యేకంగా పేర్కొనదగిన విషయం. శ్రీ కారైకుడి సోదరులు వీణాయుగళం వాయిస్తూ ఉంటే శ్రీ దక్షిణామూర్తిపిళ్లేగారి మృదంగంతో "వీణాత్రయమా" అన్న భ్రాంతిని కలుగజేసేది. నిపుణు లయిన యువ విద్వాంసుల కచేరీలకు కూడ ఆయన అనుసరణచేసి ప్రోత్సహించేవారు. ఆయన 62 సంవత్సరములు జీవించారు. ఆయన కుమారులు శ్రీ స్వామినాథపిళ్లేగారు తండ్రిగారి వలె మృదంగం, కంజిరా వాద్యాల్లో నైపుణ్యం సంపాదించి, ఈనాటికీ అనేక కచేరీలకు వాయిస్తున్నారు.

## తిరువాన్కూర్ ఆస్థాన మృదంగ విద్వాన్
# శ్రీ పళని సుబ్రహ్మణ్యంపిళ్లేగారు

పుదుక్కోట మహావిద్వాంసులు శ్రీ మాన్ పూండియాపిళ్లేగారికి ఇద్దరు ప్రధాన శిష్యులు ఉండేవారు. వారు శ్రీ పుదుక్కోట దక్షిణామూర్తిపిళ్లేగారు, శ్రీ పళని ముత్తయ్యాపిళ్లేగారు. వీ రిరువురిలో శ్రీ ముత్తయ్యాపిళ్లేగారి కుమారులు శ్రీ పళని సుబ్రహ్మణ్యంపిళ్లేగారు. శ్రీ సుబ్రహ్మణ్యంగారు ప్రప్రథమంలో తండ్రిగారి వద్ద శిక్షణపొంది తన పదకొండవ ఏట మొట్టమొదటిసారిగా కచేరీలో పాల్గొన్నారు. ఈ కచేరి ప్రసిద్ధ జలతరంగ విద్వాంసు లయిన శ్రీ రమణయ్యా చెట్టియార్ గారింట్లో జరిగింది. అప్పట్లో గొప్ప ఖ్యాతిపొందిన శ్రీ కాంచీపురం నయనాపిళ్లేగారు, శ్రీ కుళరాయనంద సుబ్బరామయ్యర్ గారు, శ్రీ టైగర్ వరదాచారి, శ్రీ మైసూరు వాసుదేవాచార్య, శ్రీ తంజావూరు పొన్నయ్యాపిళ్లె, వయొలిన్ విద్వాంసులు శ్రీ మలైకోట గోవిందస్వామి, ప్రొఫెసర్ శ్రీ ద్వారం వెంకటస్వామినాయుడు, వేణు విద్వాంసులు శ్రీ పల్లడం సంజీవరావు, శ్రీ తిరుప్పాంబరం స్వామినాథపిళ్లే, వీణావిద్వాంసులు శ్రీ కారైకుడి సోదరులు, వీణ ధనమ్మాళ్ మొదలయిన మహా విద్వాంసులకు మృదంగంతో సహకరించి వారి మన్ననలు పొంది అప్పటినుండి తన జీవితాంతంవరకు ఎందరో విద్వాంసులకు మృదంగానుసరణచేసి ఖ్యాతి పొందిరి. శ్రీ సుబ్రహ్మణ్యంపిళ్లే తండ్రిగారివద్ద గురుకులవాసం చేసినప్పటికి ఆయనకు శ్రీ దక్షిణామూర్తి పిళ్లేగారిపై గురుభావం ఉండేది. శ్రీ దక్షిణామూర్తిపిళ్లేగారికి శ్రీ సుబ్రహ్మణ్యం పిళ్లేగారు ప్రియపుత్రునివలె ఉండేవారు. అనేక కచేరీలలో శ్రీ సుబ్రహ్మణ్యపిళ్లేగారు మృదంగం, శ్రీ దక్షిణామూర్తిపిళ్ళేగారు కంజిరా వాయించి అద్భుతమయిన రంజకత్వం కలిగించేవారు. డోలు వాద్యంలో ప్రసిద్ధిగాంచిన శ్రీ మలైకోట పంచాపకేశపిళ్లేగారు, శ్రీ సుబ్రహ్మణ్య పిళ్ళేగారు సమకాలికులు. వీరిద్దరూ సోదరభావంతో మెలగి ఎన్నెన్నో ఇంపైన లయ విన్యాసాలు ప్రదర్శించేవారు. శ్రీ పళని సుబ్రహ్మణ్యంపిళ్లేగారి విద్వత్తును గుర్తించిన శ్రీ హరికేశనల్లూర్ ముత్తయ్య భాగవతార్ ఆయనను తిరువనంతపురం ఆస్థాన విద్వాంసులుగా ఏర్పరచిరి. శ్రీ సుబ్రహ్మణ్యం తన స్వంత బాణీ అంటూ ఒకటి ఏర్పరచి అనేక చక్కని లయ విన్యాసాలను రూపొందించారు. పాటకు చక్కని అనుసరణచేసి, పాటను పోషించి దానికి అద్భుతమైన పరిమళాన్ని చేకూర్చడంలో ఆయనకు ఆయనే సాటి. ఆయన యువకళాకారులను ఎంతగానో ప్రోత్సహించి వారి కచేరీలకు అనుసరణచేసి వారికి తనయెడ గౌరవభావం కలిగేటట్లు చేసేవారు. ఆయనయెడల అట్టి పూజ్యభావం కలిగిన విద్వాంసులు ఈనాడు కూడా ఎందరో ఉన్నారు. ఆయన అనేకమంది శిష్యులను తీర్చిదిద్దారు. ఆయనవద్ద శిక్షణ పొందినవా రనేకులు నేడు ప్రసిద్ధ విద్వాంసులుగా వెలుగొందుతున్నారు. ఆయన చాలా ఉత్తమ వ్యక్తిత్వం కలవారు. ఉదారగుణం కలవారు. చాలా సంవత్సరాల క్రితం ఆయన ఉత్తరదేశ తబలా విద్వాంసులయిన అనోఖిలాల్‌తోను, పాశ్చాత్య డ్రమ్మర్ అయిన జాన్‌మన్రోతోను వాయించిన లయ విన్యాసం రికార్డులు ఈనాటికీ మద్రాసు, ఆకాశవాణిలో ఉన్నవి.

### మద్గురువర్యులు 'మార్దంగికాగ్రేసర'

## శ్రీ పొట్లూరి వీరరాఘవయ్యచౌదరిగారు

ఆంధ్ర దేశమున ప్రముఖ గాత్ర వాద్య విద్వాంసు లెందరో జన్మించి పుట్టి నింటికి ఎనలేని ఖ్యాతి తెచ్చుటయేగాక అనేకమంది శిష్యులను నలుమూలలకు వెదజల్లిరి. అటు వంటి ప్రముఖులలో ఒకరు ప్రఖ్యాత మృదంగ విద్వాంసులు 'మార్దంగికాగ్రేసర' శ్రీ పొట్లూరి వీరరాఘవయ్యచౌదరిగారు. షుమారు ఎనుబది సంవత్సరములకు పూర్వము వారు కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా దింటకుర్రు అనే గ్రామంలో జన్మించిరి. చిన్నతనము నందే వారు గ్రామ దేవాలయమునందు జరుగు భజనగానములకు వెళ్లుచుండెడివారు. ఆ సమయమునందే వారికి మృదంగ వాద్యమునందు అభిరుచి కలిగి ఎట్టి కష్టములకైననూ ఓర్చి ఆ విద్య నేర్చుకొనవలెనని దృఢనిశ్చయము చేసికొనిరట. కొంతవరకు ఆ గ్రామమునందే ఒక మార్దంగికునివద్ద నేర్చుకొనిరి. తరువాత ఆ కాలమున ప్రఖ్యాత మార్దాంగికాచార్యులు బందరునివాసి అయిన "మార్దంగి కాచార్య" అశ్వధాటి రామమూర్తిగారిని ఆశ్రయించి నిశ్చలమయిన గురుభక్తితో అనేక కష్టములకోర్చి శుశ్రూషచేసి గురువుల మెప్పుబడసి మృదంగవాద్యమునందు నైపుణ్యము గడించినారు. షుమారు యిరువది అయిదు సంవత్సరముల వయస్సు వచ్చుసరికే వారు ప్రఖ్యాతగాయకు లనేకులకు ప్రక్కవాయిద్యము వాయించినారు. నిజమయిన కళాతపస్వి అగుటచే ఇంకను నేర్చుకొనవలసినది అనంతముగా నున్నదని తలంచి రామమూర్తిగారి ఆజ్ఞను గైకొని దక్షిణ దేశమునకు తరలి వెళ్లినారు. అచ్చట పుదుక్కోట అను పట్టణములో సంగీత విద్వాంసులచే నందీశ్వర అవతారముగా పరిగణింపబడిన శ్రీ పుదుక్కోట దక్షిణామూర్తిపిళ్లేగారిని ఆశ్రయించిరి. షుమారు నాలుగు సంవత్సరములు ఆ మహానుభావునివద్ద అత్యంత భక్తిశ్రద్ధలతో శుశ్రూషచేసి మృదంగమున, కంజిరా వాద్యమున కూడా పరిపూర్ణ పాండిత్యమును గడించిరి. తరువాత స్వదేశమునకు వచ్చి ప్రప్రథమముగా కాకినాడలో కళా పోషకులు 'దివాన్ బహద్దర్' శ్రీ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయుడుగారిచే నిర్వహింపబడుచున్న శ్రీ సరస్వతీ గానసభయందు మహావిద్వాంసులైన శ్రీ నైనాపిళ్లేగారి కచేరీకి శ్రీ గోవిందస్వామి పిళ్లేగారి ఫిడేలు, శ్రీ సుందరం అయ్యరు ఘటం, శ్రీ సీతారామయ్యగారి మోర్సింగు, శ్రీ పుదుక్కోట దక్షిణామూర్తిపిళ్లేగారి కంజరా వాద్యములతోబాటు శ్రీ వీరరాఘవయ్య చౌదరిగారు మృదంగం అత్యంత నైపుణ్యముతో వాయించి ప్రజల, విద్వాంసుల మన్ననలు బడసిరి. అంతేగాక వారు జీవించి ఉన్నంతకాలము శ్రీ సరస్వతీ గానసభయందు ప్రతిసంవత్సరము కచేరీలకు మృదంగము, కంజిరా వాయించుచుండెడివారు. శ్రీ చౌదరిగారు దేశమున నలుమూలల అనేక గానసభలలో ప్రముఖులకు ప్రక్కవాయిద్యము వాయించిరి. కొన్ని సమయములలో ఒకే కచేరీలో శ్రీ చౌదరిగారు కంజిరా, వారి ప్రథమ గురువు లయిన శ్రీ అశ్వధాటి రామమూర్తిగారు మృదంగము, వాయించుటకూడా జరుగుచుండెడిది.

శ్రీ చౌదరిగారి కాలమునకు ముందు ఆంధ్రదేశమున మృదంగమునకుగాని, మృదంగవిద్వాంసునకుగాని నేడున్న గౌరవము ఉండెడిదిగాదట. వారే మృదంగము నొక ఉత్కృష్టమైన వాద్యముగా రూపొందించి ప్రజలు దానికి గాత్ర, తంత్రీ వాద్యములతో సమాన గౌరవము నొసగునట్లు జేసిరి.

## వారి వాద్యమందు ప్రత్యేకత

కచేరీలందు గాయకునితో మృదంగముపై ననుసరించుటలో వారికి వారే సాటి యనిపించు కొనిరి. పాటను పోషించుటలో నాదానుభవము, గంభీరత్వము, సున్నితము అక్కడి కక్కడే ముక్తాయి పంపకము చాలా వివరణగా ఉండెడివి. వర్ణమునకు, కీర్తనకు, స్వరమునకు దేని కెట్లుండవలెనో ఆ విభజనతో వాయించెడివారు. వారు మృదంగము వాయించిన రక్తికట్టని గానసభ లేదు. ఇక పల్లవికి వాయించుటలో వారు సిద్ధహస్తులు. ఎంత క్లిష్టమయిన పల్లవిని గాయకుడు పాడినను శ్రీ చౌదరిగారు సునాయాసముగా వాయించెడివారు. వీరికి పూర్వము ఆంధ్రదేశములో కచేరీలో మృదంగము తనిఆవృత్తమునకు ప్రాముఖ్యము వుండెడిది కాదట. శ్రీ చౌదరిగారు కచేరీలలో వాయించుట మొదలిడినప్పటినుండి ప్రతి కచేరీలో మార్దంగికునికి కూడా తని వాద్యమునకు అవకాశమిచ్చి గౌరవించుట మొదలయినది. చెన్నపట్టణమందుకూడ వారు కొంతకాలముండి అనేక సభలలో ప్రఖ్యాత విద్వాంసు లందరికి మృదంగము, కంజిరా వాయించి ప్రఖ్యాతిచెందిరి. శ్రీ చౌదరిగారికి మృదంగమే జీవితము. మృదంగమే వారి ఆరాధ్యదైవము. వారు ఎంత గొప్ప విద్వాంసులైనను ఇంకను విద్యార్థినే అను భావముతో సాధన చేసెడివారు. సాధన విషయములో వారికి పగలు, రాత్రి అను భేదము లేదు. దాదాపు రోజుకు ఎనిమిది గంటలు మృదంగముగాని, కంజిరా గాని సాధన చేసెడివారు. 'విద్యకు వినయము భూషణ'మన్న పెద్దల వాక్కునకు శ్రీ చౌదరిగారే ఉదాహరణము. వారు అజాతశత్రువులు. గాయకులతోగాని, ఇతరులతోగాని ఎంతో ఆప్యాయతతోను, ఎదుటివారి గౌరవమును, మన్ననలను చూరగొను విధముగాను సంచ రించెడువారు.

శ్రీ రాఘవయ్యచౌదరిగారి శిష్యకోటి చాల పెద్దది. మృదంగమునందు శ్రద్ధను కనుపరచిన అనేకమంది పేదబాలురను వారి గృహమునం దుంచుకొని ఆదరించి దయార్ద్ర హృదయముతో వారికి విద్య గరపిరి; వారు తమ శిష్యులకు మృదంగవిద్యతోబాటు సత్ ప్రవర్తనకూడ అలవరచుటకు ఎంతో కృషిచేసెడివారు. శ్రీ రాఘవయ్య చౌదరిగారు శిష్యులకు విద్యాబోధనచేయు విధానము ఎంతో ప్రత్యేకమయినది. ఎప్పుడూ పదిహేను, ఇరువది మంది శిష్యగణ ముండెడిది. శిష్యులకు మృదంగముపై "తొం తొం తక తొం తొం తక తకిట తకిట తా తాదిన తొం తొం గా తొం తాం తాం తాం తాం" అను శ్రీ గణపతి ప్రార్థనా శబ్దము నోటితో అనిపిస్తూ మృదంగముపై వాయింపించి తరువాత పాలవరుస లలో మొదటి పాఠమయిన "త, ధి తొం నం" అను శబ్దమును ప్రారంభించెడివారు. పై గణపతిప్రార్థన శబ్దము ప్రార్థనకొరకేగాని సాధన చేయనిచ్చెడివారుకారు. చినపాల వరుసలు,

పెదపాల వరుసలు ఆదితాళము, రూపకతాళము, మిశ్రచాపు, త్రిశ్రరూపకము, త్రిశ్రత్రిపుట వరుసగా తాళమునకు యిరువది అయిదు పాఠముల చొప్పున నేర్పెడివారు. పూర్వీకులు మృదంగ విద్యార్థులకు పాలవరుసలు చెక్కలతో చేయబడిన "దొంతర" అను దాని మీద చెప్పెడివారు. కాని శ్రీ చౌదరిగారు అట్లుగాక ప్రారంభమునుండి కూడ మృదంగముపైనే అభ్యసింపజేసెడివారు. వారి గృహమునకు తరచు అనేకమంది గాయకులు వచ్చి సాధన చేసికొనుచుండెడివారు. ఆ సమయములందు గాయకులకు తామే గాక, తాళములు పూర్తి అయిన శిష్యులచేత కూడా వాయింపజేసెడివారు. ఇదిగాక కచేరీలలో తాము కంజిరా తీసికొని శిష్యుని మృదంగమునకు కూర్చుండబెట్టి గాయకుని సరి అయిన పద్ధతిలో అనుసరించుట అభ్యసింపజేసెడివారు. కొంతమంది గాయకులకు వారు కష్టమయిన పల్లవులు అనేక తాళములలో పదగర్భముచేసి చూపెడివారు.

శ్రీ రాఘవయ్యచౌదరిగారు అత్యంత గురుభక్తి పరాయణులు. తమ గురువరేణ్యులైన శ్రీ రామమూర్తిగారికి, శ్రీ దక్షిణామూర్తిపిళ్లేగారికి ఎంతో వ్యయము చేసి షష్టిపూర్తి మహోత్సవములు జరిపించిరి. వారి జీవితము క్రమశిక్షణకు ఒక ఉదాహరణము. ఇతరులకు ఇబ్బంది కలుగకుండా చెప్పిన వేళకు హాజరు అయ్యెడివారు. ఈవిషయము వారికి ఎంత ముఖ్యమో తెలుపుటకు ఒక ఉదాహరణము చాలును. శ్రీ రాఘవయ్యచౌదరిగారు రైలు బయలుదేరు వేళకు చాలా ముందుగా స్టేషనుకు వెళ్లెడివారు. ఎవరయినా, "అయ్యా, తమరు ఎల్లప్పుడూ రైలు వేళకు ఇంత ముందుగా వస్తారెందుకు" అని అడిగితే దానికి వారిచ్చిన సమాధానము "నాయనా, మా వృత్తి కచేరీలకు వెళ్లి సంపాదించుట. అట్టి కచేరీలకు సరి అయిన వేళకు హాజరు అగుట మా విధి. మాకు రైలు తప్పిన ఆనాటినుండి మా యీ వృత్తి మానివేయుట సమంజసము" అనేవారు. అట్టి క్రమశిక్షణ శ్రీ చౌదరిగారిది. శ్రీ చౌదరిగారు ఆంధ్ర తమిళ దేశముల ప్రఖ్యాతిగాంచి గానసభలలో చాదాపు అన్నిటిలోను ఘనసన్మానములు బడసిరి. ఒకటి 1931-వ సంవత్సరము మార్చిలో నరసరావుపేటయందు బ్రహ్మశ్రీ పిరాట్ల శంకరశాస్త్రిగారి అధ్యక్షతను జరిగిన తృతీయాంధ్ర సంగీత పరిషద్వార్షిక సభ. ఆ సభయందు పారిషదులు వీరి మృదంగవాద్య వైదుష్యమున కచ్చెరువంది సల్లక్షణోపేతుండని, గాంభీర్యాది గుణవిశేషణములు కలిగిన ధీరోదాత్తుడని వినుతించి "మార్దంగికాగ్రేసర" అను బిరుదు ఒసగి వీరి ప్రజ్ఞా ప్రాభవములను గుర్తించిరి. ఇంకను పలుచోట్ల వీరి పాండిత్యమునకు చిహ్నముగా ఘంటాకంకణములు, సువర్ణపతకములు, సన్మానపత్రములు ఒసంగబడినవి. పై విధముగా జీవితమంతయు కళ కంకితముచేసి అనేకమంది శిష్యులకు మృదంగము, కంజిరా వాద్యములు నేర్పి విద్యాభిక్షపెట్టి వారు తరించి, ఇతరులను తరింపజేసిరి. ఈ మార్దంగికచక్రవర్తి షుమారు యేబది సంవత్సరములు జీవించి 1942-వ సంవత్సరము నవంబరు 10-వ తేదీన విజయవాడ పట్టణములోని వారి స్వగృహమందు భార్యను, ఇద్దరు పుత్రికలను, సంగీతరసికులను, శిష్యకోటిని దుఃఖసాగరమున ముంచి దేహయాత్ర చాలించిరి. ప్రతి సంవత్సరము కార్తీక శుద్ధ విదియనాడు శ్రీ పొట్లూరి వీరరాఘవయ్యచౌదరిగారి వర్ధంత్యుత్సవములు అస్మదాది శిష్యబృందముచే జరుపబడుచున్నవి.

# శ్రీ మహాదేవు రాధాకృష్ణరాజు

ప్రశ్న : అయ్యా, రాధాకృష్ణరాజుగారూ! నమస్కారం మీ జీవితవివరములు తెలుసుకుందామని ఉన్నది. సెలవిస్తారా?

సమా : నమస్కారం. అడగండి చెపుతాను.

ప్రశ్న : మీరు సుమారు 40 సంవత్సరాలనుంచి మృదంగ విద్వాంసులుగా ప్రఖ్యాతి గడించినవా రని మే మనుకుంటున్నాం, అంతేకదా?

సమా : మీ రనుకొన్న కాలంలో మొదటి కొద్దికాలంలో మధ్యస్థ స్థితి కొద్దిగా ఉన్నా 35 సంవత్సరాలుగా మన ఆంధ్ర దేశంలోని పెద్దగాయకులు అనగా కీర్తిశేషులు శ్రీయుతులు పారుపల్లి రామకృష్ణయ్యపంతులుగారు, ద్వారం వెంకటస్వామి నాయుడుగారి వంటి పెద్దవిద్వాంసు లందరికి మృదంగం మీద ప్రక్కవాద్యం వాయించాను. వా రందరు న న్నాశీర్వదించిన వారే.

ప్రశ్న : అయ్యా, రాజుగారూ! తమ జన్మస్థానం ఏదండీ?

సమా : కృష్ణాజిల్లాలో గుడివాడ తాలూకా, పెదవిరివాడ.

ప్రశ్న : తల్లి దండ్రు లెవరండి?

సమా : మా నాయనగారిపేరు వెంకటరాజుగారు. మా అమ్మగారు రత్నమ్మగారు.

ప్రశ్న : మిమ్మల్ని మృదంగ వాద్యం వాయించాలని పురికొల్పిన పరిస్థితు లేమిటో సెలవిస్తారా?

సమా : మా గ్రామంలోనే భజనగోష్ఠి ఒకటి మా గ్రామస్థు లంతా కలసి ఏర్పాటుచేసికొని రామదాసుకీర్తనలు, తరంగాలు మొదలయినవి పాడుతుంటే మొదట దానిలో గొంతు కలిపి తరువాత మృదంగం వాయిస్తే బాగుండు ననుకొన్నాను.

ప్రశ్న : మరి వెంటనే మృదంగం వాయించారా?

సమా : అసలే నేర్చుకోనిదే ఎలా వాయించటం? అందుకని ఆ భజనగోష్ఠిలోనే మృదంగం వాయించిన శ్రీ శింగరాజు సుబ్బరాజుగారివద్ద నాలుగు మాసాలు అభ్యసించి తరువాత భజనగోష్ఠిలో మృదంగం వాయించాను. దానిలో నా కున్న చొరవను గ్రహించి మా గ్రామపెద్దలు, మా బంధువులు నన్ను 'మార్దంగికాగ్రేసర', శ్రీ పాట్లూరి వీరరాఘవయ్యచౌదరిగారివద్ద 1930-వ సంవత్సరంలో విద్యాభ్యాసం కోసం అప్పగించారు.

ప్రశ్న : బాగుంది రాజుగారూ ! దిట్టమైనచోట పడ్డారు. వారి వాద్యం నా చిన్నతనంలో నేనూ విన్నాను. చాలా ఘనంగా ఉండేది. సరే. వారి వద్ద విద్యాభ్యాసం ఎంతకాలం చేశారు ?

సమా : ఎనిమిది సంవత్సరాలు చేశాను. వారి ఆశీర్వచనబలం నాకు సంపూర్ణంగా కలిగింది.

ప్రశ్న : కనుకనే మీరు పెద్దవిద్వాంసులుగా ప్రఖ్యాతి చెందారు.

సమా : నా అభిప్రాయం దేని కయినా గురుకటాక్షం మూలమనీ, అందులోనూ మా ఊరి ఆదరాభిమానాలు నాకు మూలధనమై నేటికీ అనువ రిస్తూ ఉన్నవని.

ప్రశ్న : రాజుగారూ, మీ విద్వత్తుకు చిహ్నంగా మీ కేవయినా సన్మానాలు జరిగాయా ? జరిగితే చెప్పండి.

సమా : ఏనాటికీ నేను మరవలేని సన్మానం నాకు 1954 ఆగస్టులో జరిగినది. ఆ సభకు కీ. శే. మధ్వశ్రీ కాశీకృష్ణాచార్యులుగారు పర్యవేక్షకులు, సంగీతకళానిధి కీ. శే. శ్రీ ద్వారం వెంకటస్వామినాయుడుగారు అధ్యక్షులుగా పౌరుల తరఫున 5,116 రూపాయల పర్సు బహూకరించారు. అదీకాక సువర్ణఘంటాకంకణాన్ని కీ. శే. శ్రీ పళని సుబ్రహ్మణ్యపిళ్లేగారు చేతికి వేశారు.

ప్రశ్న : ఆ సభకు నేనుకూడా వచ్చాను, ఇప్పుడు జ్ఞాపకానికి వచ్చినది. అటువంటి విద్వత్పరివేష్టితమయిన సభ 'నభూతో న భవిష్యతి' అనుకున్నా రప్పుడు. మరి అప్పు డిచ్చిన బిరుదు సంగతి చెప్పరేం ?

సమా : 'మృదంగవాద్యవిశారద' బిరు దిచ్చారు. ఆ బిరుదు మీది మోజు కంటె నలుగురికి విద్య చెప్పే విషయంలో నాకు మోజు.

ప్రశ్న : ఆ మోజు మీకు బాగానే తీరింది. ఇదివరలోనే చాలామంది మీవద్ద విద్య నభ్యసించినవాళ్లు పెద్దవాళ్లై ఒకస్థానంలో వున్నారు కదండీ ?

సమా : అవును. ప్రభుత్వ సంగీత కళాశాలలో నా ఆశయం ఇంకా ఎక్కువగా ఫలించింది. కళాశాల సేవాసమయంలో ఈ గ్రంథాన్ని ఈవిధంగా వ్రాసి విద్యార్థులకు ఉపయోగకరంగా అందిద్దామనిపించింది.

ప్రశ్న : రాజుగారూ, విద్యార్థులకేకాదు, పాఠ్యప్రణాళికగా విద్వాంసునికీ ఉపయోగమే కదండీ ?

సమా : అవును. 1975-వ సంవత్సరంలో నేను పదవీ విరమణ చేశాను. అనతికాలంలో నా ఆప్తుల అందరి సహకారంతోనూ ఈ గ్రంథం వెలువరించగలిగాను.

ప్రశ్న : అయ్యా, మరి మీరు ఆధ్యాత్మికంగా ఏదయినా జపం వంటివి చేస్తారా ?

సమా : నాకు 1956 లో మహాభక్తు లయిన శ్రీ అంబడిపూడి విశ్వనాథంగారు, శ్రీ మల్లాది దక్షిణామూర్తిశాస్త్రిగారు విష్ణుసహస్రనామోపదేశం చేశారు. తదాది నేను దాన్ని జపించికాని ఇంటినుంచి బయటికి రాను. నేను యాత్రగా వెళ్లినప్పుడు హృషీకేశంలో శ్రీ శివానందస్వామివారి సేవాభాగ్యం కలిగింది. వారు నన్ను "మృదంగజ్యోతీ" అని పిలచి ఆశీర్వదించారు.

ప్రశ్న : మీరు చాలామంది పెద్దపెద్దవారి కచ్చేరీలకు మృదంగం వాయిస్తుండగా నేను విన్నాను. త్యాగరాజు పంచరత్నకృతులు, వర్ణాలు, పాఠంవచ్చినట్లు వాయిస్తారు ఏమిటి కారణం ?

సమా : మా గురువుగారివద్ద అభ్యసించేటప్పుడే కీ. శే. పారుపల్లి రామకృష్ణయ్యపంతులు గారి శిష్యులు ఎవరో ఒకరు వచ్చి పాడటంచేత అవి నాకు కంఠతః వచ్చినవి.

ప్రశ్న అలాచెప్పండి. అందుకనే మీ వాద్యంలో ఆ రక్తి. మరి మీ వంశం మృదంగ వాద్యవిద్యతో కొనసాగుతోం దనుకుంటాను.

సమా : ఇంతవరకు ఆవిధంగానే వున్నది. నా పెద్దకుమార్తె శ్రీమతి బాదరవాడ రత్నమాల మృదంగవిద్యలో ఒకస్థానానికి వచ్చినది. మా పెద్దవాడు మీ దయవల్ల దానిలోనే ప్రావీణ్యం సంపాదించేటట్లు కనపడుతున్నాడు. 1974 లో ఆలిండియా రేడియో పోటీలలో మృదంగంలో మొదటి బహుమతి గ్రహించాడు. చాలాచోట్ల మంచి కచేరీలలో మృదంగం వాయించాడు. ఇదీ వాని స్థితి.

ప్రశ్న : రాధాకృష్ణరాజుగారూ ! మరి సెలవు. చాలా దయచేసి తెలిపారు. సంతోషం.

విజయవాడ
17 - 6 - '76

పరిచయకర్త
నల్లాన్‌చక్రవర్తి కృష్ణమాచార్యులు.